

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# నలచరిత్ర - పదము.



శ్రీరమాలోలయా శ్రితలోకపరిపాల,
యసురవిఫాల జోహారుజేతునీక.
సత్యలోకాధీశ శారదాహృదయేశ,
కమలసంభవ నమస్కారములునీకు
కైలాసగిరివాస గౌరీమనోల్లాస,
శంకరాగొల్తునీ చరణకమలములు.
ఇందిరాజలజాత మందిరానీవుమా.
మందిరంబుననిల్చి మముఖోవవమ్మ
వాణీలలితనీలవేణీ శరోజాత,
పాణీసదానన్ను పాలింపవమ్మ,
గౌరీధరాధరకుమారీ మహాదేవ,
నారీకృపామతిని నన్నురక్షించు.
మూషకవాహనా మునమొప్పనీకృతికి,
నిర్విఘ్నమొనరించు నీకుమ్రొక్కెదను.
సూర్యచంద్రక్షితీసుత సౌమ్యగురుశుక్ర,
శనిరాహుకేతులను వినుతిగావింతు.
వాల్మీకిభవభూతి వ్యాసబాణమయూర,
కాళిదాసాది సత్కవుల సేవింతొ
బమ్మెరపోతన్న భాస్కరతిక్కన్న.

నన్నయభట్టులను సన్నుతించెదను.
వర్తమానకవీంద్ర వరులసన్నుతిజేసి,
భావికవీంద్రులను బ్రస్తుతియొనర్చి.
ఒప్పుగానాజన్న వృత్తాంతమునకొంత,
వినుపింతువినరయ్య వివరంబుగాను.
అవనిలోపలనే బదాయదేశములలో,
రమ్యమయినకలింగ రాజ్యంబుగలదు.
ఆదేశమున నెపుడు యాదిలక్ష్మిదేవి,
నిండువేడుకతోడ నివసించియుండు.
అట్టికళింగరాజ్యమున కెల్లనువిజయ.
నగరంబనగనొప్పు లగురాజధాని.
ఆపురంబును ద్వారకాపురంబునుబోలి,
భూపురంబులలోన పొగడొందుచుండు.
ఆపట్టణాధీశు డాదిత్యతేజుండు,
పూసపాటికులాబ్ధి పూర్ణచంద్రుడు.
రాజేంద్రుడగు విజయరామగజపతినుహా,
రాజతనూజుండు రాజాదిరాజు.
ఘనబలుండానంద గజపతిమన్యసుల్,
తానుబహద్దూరు మాన వేశ్వరుడు.
శ్రీరామచంద్రుని రీతినిసుదలక్ష,
పరిమితంబయినట్టి ధరణీతలంబు.
పాలించిభవ్యన్న భామలెల్ల గ్రహించి,
చౌషష్టివిద్యలను చక్కగానేర్చి,
ప్రఖ్యాతినొందెనా ప్రభుపాలితంబయిన,
కోనాడదరినుండు గోవిందపురము.

నలచరిత్ర - పదము.

కాపురంబుగనుండి ఘనమయినకీర్తిచే,
విలసిల్లెతోలేటి వేంకటాఖ్యుండు.
అతనికినిసుతుడు ప్రఖ్యాతివంతుండగుచు,
భాగేశ్వరుండనగ భాసిల్లెభువిని.
అతడుసత్యమునందు నాహరిశ్చంద్రుండు,
పరమశాంకరంబునకు పాండవాగ్రజుడు.
దానంబునకునుతా ధాతనూజుండు,
గాంభీర్యమునకు సాగరసమానుండు.
కూర్మినాదీరునకు ధర్మపత్నిగనొప్పు,
సుగుణమణీవేటి సుబ్బమవధూటి.
ఆదంపతులకునే నాత్మసంభూతుండ,
చండికాంబామంత్ర జపతత్పరుండు.
అవనిసీతారామ యాభిధేయుడమరియు,
శ్రీవేణుగోపాల సేవారతుండ.
క్షితిలోనశ్రీభీమసింగి గ్రామమునందు,
గాపురంబుంటి సద్గురుకృపచేత.
వేణుగోపాలుసేవించి యాతనకృపనుక,
వితారసజ్ఞతను గల్గియుండుటను.
అకలంకముతోడ నొకపుణ్యచరితంబు,
పామరజనంబులకు బహుసులభమునను,
వర్ణించుటకుపదమ సరసరీతిరచింప,
నూహచేయుచునుండ నొకదినంబందు.
భువిలోననైశాఖ పురనివాసుండల్లున,
కలగర్ల వేంకట కామయార్యుండ.
ననుబిల్వగాబంచి కనకాంబరములాది,

# నలచరిత్ర - పదములు.

బహుమతుల్ గావించి బల్కెనిట్లనుచు.
భూసురోత్తమనీవు పూర్వంబుశశిరేఖ,
పరిణయక్రమమెల్ల పదముగావించి.
ప్రచురంబుగాచేసి ప్రఖ్యాతిగాంచితివి,
నలనొప్పగానిపుడు నలునిచరితంబు.
మృదుతరంబుగనీవు పదముగారచియింపు,
మాచంద్రతారార్క మగుచుమీకీర్తి.
అనిప్రియంబొప్పగా నానైశ్వరత్నంబు,
వినయంబుతోజెప్పి విడియంబొసంగ.
నలనొప్పసంతోష వార్ధిలోనలదేలి,
క్షితిలోన శ్రీభీమ సింగగోపాలు.
కృతినాథునిగజేసి పృథివిలోజనులెన్న,
నేనీకథనుజెప్ప బూనుకున్నాడ.
సత్కవీశ్వరులార సరవిగానిందేమి,
తప్పులుండినమీరు తగదిద్దవలయు.
కలిదోషహారణంబు కామితఫలదంబు,
బలవర్ధనంబు యీనలునిచరితంబు.
గావునసునీసభను గలబ్రాహ్మణోత్తములు.
రాజులునువైశ్య శూద్రాదులందరును.
నిర్మలచిత్తులై పేర్మినీచరితం,
సంతసంబునవినుడి శాంతంబుగాను.
పరమపావనులయిన పాండవేయులుతొల్లి,
కుత్సితుండయినట్టి కురురాజుచేత,
మాయజూదంబాడి మహితలంబునునోడి,
తనతమ్ములనుగూడి ధర్మనందనుడు.

## నలచరిత్ర - పదము.

విపినభూములలోన విహరింపుచుండంగ,
ఘనుఁడయినబృహదశ్వ ఘనమునీశ్వరుఁడు.
నిర్మలచిత్తుఁడయి ధర్మనందనుఁజూడ,
వచ్చినఁజూచి భూవరుఁడు మోదమున.
ఎదురుగాఁజనిమౌని పదములకు సాష్టాంగ,
మర్పించిభక్తితో నర్ఘ్యపాద్యములు.
బృహదశ్వుఁడు ధర్మరాజునొద్ద జనకుశలంబడుగ





నిచ్చ చేతులుమోడ్చి యెదురుగానిలచున్న,
మునిచంద్రుఁడాధర్మ తనయునీక్షించి.
సేమమాయనఁగనా భూమీశ్వరుండెపుడు,
వినయంబుతోఁబల్కె మునినాథుతోడ,
ఓమునికులచంద్ర యోకరుణాసాంద్ర
జెప్పెదవినుఁడునా క్షేమమంతయును.
మాయజూదంబాడి దాయాదులచునేను,

ధరణీతలం బెల్ల తగనోడినాను.
తమ్ములతో గూడి తపసివేషముదాల్చి,
విపినభూములలోన విహరింపనలసె.
కట్టడిదైవంబు కరుణయించుకలేక,
నిట్టియాపదలుమా కిడెనిప్విధమున.
అనురాసురులనయిన నవలీల గెలువంగ,
జాలుతమ్ములునేను శౌర్యముల్ విడచి.
దీనులగతినిట్లు దిరుగంగప్రాప్తించె,
దాపసవర్య యీ ధరణిలోత్రొల్లి.
ఎవరైనమారీతి నిడుములనుబొందిరే,
యెరిగితేజెప్పవే కరుణాంతరంగ.
అనిధర్మనందనుం డడుగంగనామౌని,
ఘనకృపారస మొల్కగానిట్లులనియె.
ఇదియేమిజననాథ యింతమాత్రంబునకు,
తమ్ములనుబాసితివో తరుణినెడబాసితివో.
సమ్మతిగాని వేషముజెందినావో,
కలిమియును లేమియును కష్టముల్ సుఖములున
కావిటికుండల గతినుండునుమ్మి,
అదిగాకయే కష్టమనుభవించితివయ్య.
వసుధకష్టములొందు వారిలోనీవు,
పూర్వకాలమునందు భూతలాధిపుడయిన.
నలచక్రవర్తియా కలిమాయచేత,
వేడుకనుపుష్కరునితోడ జూదం బాడి.
యోడిభార్యాతోడ గూడికానలకు,
పోయిదీనతజెంది కాయకసరేచుకొని.

భక్షించిబిడములను వృక్షములక్రింద,
  పవ్వళింపుచునుండి పైనున్నవస్త్రంబు.
పక్షులచేతగోల్పడి యింతిదాను,
  ఏకవస్త్రముగట్టి యిడుములుబడిరొక్క.
పాడుసావిడిజేరి పడతినిద్రింప,
  అడవినొంటిగసతిని విడనాడితానొక్క.
పుడమిూశునకుమంట పుట్టివాడుచు,
  కొలువుండెతనభార్య ఘోరకష్టంబులును.
బొందుచునుతననాథు నెందుగానకను,
  ఒకభూమిడతిభార్య యొద్దసైరంధ్రియై.
కొలువుండెనీరీతి కొంతకాలంబు,
  కష్టంబులనుబొంది కడకుశ్రీహరికృపను,
తపనాథుడునుతాను ఘనివై భవమున,
  కలుసుకొనితొల్లింటి గతినిరాజ్యముజెంది.
సర్వేశుకరుణచే సర్వసౌఖ్యములు,
  అనుభవించియనేక యశ్వమేధాదులను.
గావింపుచును దీర్ఘకాలమిాధాత్రి,
  పాలించినారు భూపాలదారలు.
బద్ధకష్టములలోన నీకష్టమేపాటి,
  అనియిట్లు బృహదశ్వుడాధర్మజునితోడ.
జెప్పగానతడు నచ్చెరువొందిమరియు,
  మునినాథుతోడనా జననాయకుడుబల్కె.
వరుసగా నలచక్రవతిఁ చరితంబు,
  ఆద్యంతమువినంగ నభిలాషగానుండె.
దయచేసిచెప్పవే తాపసోత్తంగ,

## నలచరిత్ర - పదము.

పుణ్యాత్ములయినట్టి పూర్వులచరిత్రములు.
విన్నమాత్రంబుచే వివిధదుఃఖములు,
పరిహారమగు సకలభాగ్యములు చేకూరు.
ఛేదంబడగునదికి మోక్షంబుగలుగు,
కావునమునాయందు కరుణించినలరాజు.
చారిత్రసంతయును శాంతంబుగాను,
వినుపింపుమనినుహా వినయంబుతోబల్క

—(*) నిషధాపురవర్ణన. (*)—

వినుమనుచుబల్కెనా మునిచంద్రుడిట్లు,
ధన్యతనూజ యింధారుణిలోగల్గు.
పురవరంబులకెల్ల భూషణంబగుచు,
పంచాశతక్రోశ పరిమితంబునుగల్గి.
నిహామగతినొప్పు నిషధాపురంబు,
ఆపట్టణంబెన్నన జవరాదులకైన.
తరముగాదిలను నెవ్వరితరంబను,
నలుబదిబురుజులును గలిగిరవిమండలమువాటి.
చుక్కలనన్నట్టుకోట యున్నతరము,
ఆలోనగల సౌధజాలములు.
నవరత్నస్థాపితంబయి ధగద్ధగమెరయుచుండు,
వేదవేదాంగముల విధింగెల్వగజాలు.
పురములోపలగల్గు భూసురోత్తములు,
బాహుబలంబునకత పరశురామునికన్న.
మించిశత్రుల నంహరించురాజులును,
కోట్లకొలందిగా కొనగనమ్మగజాలు,
యలకుబేరునిసాటియగు వైశ్యములు

బలరాముతోసాటి బరగునాలవజాతి.
యుక్కుతునకలనంగ నొప్పుదుప్రభటులు,
మేనకారంభలను మించినసౌందర్య.
వతులగుచునొప్పుదురు వారకామినులు.
పర్వతంబులబోలు భద్రగజంబులును.
భద్రగజములబోలు బరగుసుహయములు,
వాయువేగముకన్న వడితోనరుగునట్టి.
వన్నెలతోలుగలవు వరతురంగములు,
వారాసికెనయైన వరతటాకంబులును.
శృంగారవనములును చెరకుతోటలును,
సంగీతలయములు సత్రములుఘనమయిన.
దేవాలయంబులును దివ్యభవనములు,
ఘోటకశాలలును కొలువుకూటంబులును.
నాటకశాలలును నళిరాకరములు,
కవిభటవందిమాగధ పరియాచకులు.
గాయకపౌరాణికా ప్రకరములును,
సకలవస్తుదుకాణ సముదాయముగల్గి.
యలకాపురముకన్న నతిశయంబగుచు,
ఆపురంబునజూడ నంగహీనులులేరు.
జారులులేరనా చోరులునులేరు,
వరుసతోకలహించు వారలెక్కడలేరు.
మతిచంచలులులేరు వెతకిచూచినను,
కులహీనులునులేరు పలుగాకులనులేరు.
చిత్తచాంచల్యులును బొత్తిగాలేరు,
కపటచిత్తులులేరు గాలించిచూచినను.

శోధించి తేలేరు పయిధన్యసతులు,
    అపసవ్యమరణంబు లాదేశమున లేవు,
నాల్గుపాదములచే నడుచుధర్మంబు,
    ఆకారాధీశ్వరుం డతిదయాచిత్తుండు.
మేరునగధీరుండు సమితభామణుండు,
    కవిలోకభోజుండు కమలోస్తతేజుండు.
దుష్టసంహారుండు శిష్టావనుండు,
    పరమపవిత్రుండు పంకజనేత్రుండు.
నిత్యదానవినోది నిఖిలార్థవేది,
    సురరాజవిభుడు భాసురసద్గుణోజ్వలుడ
మన్మథాకారుండు మదగజబలుండు,
    అబ్ధిగంభీరుండున సహాయశూరుండు,
సింహవిక్రముడు నాశ్రితవత్సలుండు,
    సత్యసంపన్నుండు సద్ధర్మనిరతుండు.
పరసతీవిముఖుండు బంధుప్రియుండు,
    నిరుపమగుణశాలి నిర్మలాచారుండు.
దివ్యశరీరుండు దీర్ఘబాహుండు,
    సూర్యవంశాంభోధిసోముండు
మదవతీకాముండు శత్రుభీకరుడు శ్రీకరుడు,
    చిరకీర్తియగు వీరసేనుపుత్రుండు.

——( ) నలుం డుద్యానవని కేగుట. ( )——

నరలోకనుతకీర్తి నలచక్రవర్తి,
    కరమొప్పవిష్ణుచక్రము పంపుసేయంగ.
భూచక్రమెల్ల నేర్పుగ నేలుచుండె,
    ఈరీతినుండంగ నాహూడిగానంత.

నళచరిత్ర - పదము.

సంతసమొప్ప వసంతకాలంబున,
చనుదెంచెమందార ఘనసారఖర్జూర,



జంబీరపాటల జంబుపున్నాగ,
నారికేళకదంబ సారంగతింత్రిణీ.
కదళీవటాశ్వత్థ కల్హారతిలక,
కేతకీవకుళకంకేళి బిల్వతమాల,
పనసపిప్పలనింబ బదరీమధూక,
చూతమాలూరక భల్లాతకురంటక.
కరవీరసురసాల క్రముకశ్రీగంధ,
మరువకామలకాది మహీజాతములు నెల్ల.
ములుకొనిచిగురించి మొగ్గలునుబొడమి,
పూచికాచిఫలించి పూపరాగంబెల్ల.
రాలికుప్పలుబడెను రమ్యంబుగాను,

పూదేనియలుద్రావి భృంగసమూహంబు.
ఝుమ్మనినినదములో గృమ్మరుచునుండె,
కోవెలగుంపెల్ల కోయ నీరొదజేసి.
చిగురాకు తెల్ల భక్షించివిహరించె,
ఇవ్విధంబుననుండనిన కులాధిపుడయిన.
నలమహీపతియొక్క నాటిసమయమున,
వనవిహారము సేయ మనసులోనదలంచి.
తనవంతయును తగరథం బెక్కి.
వలనొప్పుశృంగార వనముప్రవేశించి.
చల్లనిగాలికిని సంతోషపడుచు,
తుమ్మెదధ్వనులకు సమ్మోదమొందుచును.
పువ్వులతావికి పుగమెచ్చుకొనుచు,
కర్ణామృతంబుగా గనుబల్కుచిల్కలను.
జూచిమానసమందు చోద్యమందుచును,
మంత్రినాథునిగూడి మనుజేశ్వరుండచట.
సంతోషముననుండు సమయంబునందు.
అద్భుతంబొప్పంగ నాకాశముననుండి.
రాజహంసలుకొన్ని రయముగావచ్చి,
ధరణీశ్వరుని సన్నిధానమునవ్రాలంగ.
అపరిమితానంద డగుచుభూవిభుడు,
మంత్రినిజూచి సమ్మదమొప్పగాబల్కె.

—(*) నలుడుహంసలపట్టబోవుట. (*)—

నీహంసలెటనుండి యిటకువచ్చినవో,
కనులకానందంబుగా నుండెనోమంత్రి.
పండువెన్నెలరీతి నుండెవనమెల్ల,

ఇందులోనొకహంస నిపుడుబట్టుకుమనమః.
నకళలంకగతిన ముద్దాడుదామనగ,
మదిసంతసించి యామంత్రిదిగ్గునలేచి.
అమరంగపక్షులకు నడ్డముగనిలువ,
మేదినినాయకుడు మెల్లమెల్లనవచ్చి.
పట్టబోవలగ నాపక్షులును బెదర,
ఒకచెట్టుపయి వ్రాలనుర్వీశతిలకుండు.
మంత్రినివేగరమ్మని సైగజేసి,
నీవిప్పుడాచెట్టు నేర్పుమీరగనెక్కి.
క్రిందికినిదోలుమా యిందుండినేను,
పట్టెదననగ యాచెట్టెక్కియామంత్రి.
తోలంగనవిబెదరి నేలపయివ్రాలె,
వ్రాలినజూచిభూవరుడు మంత్రిముఖంబు.
ననివల్కెనీవు వేగమె చెట్టుదిగుము.
అనగనామంత్రి నయ్యనచెట్టుదిగివచ్చి,
త్రోవకడ్డమునిలువ భూవరుండపుడు,
పాదరింద్లపొంచి పొంచితారుచుబోయి.
మెల్లలేయొకహంస మెడబట్టుకొనగ,
కడమహంసలుజూచి కడుభయంబునుబొంది.
చివ్వననెగసియొక చెట్టుపయివ్రాలె,
చెలువొప్పనలరాజు చేచిక్కబడ్డట్టి.
కలహంసమదిలోన కడుభీతినొంది,
మదిలోనగలపోసె నిదియేమిదైవమా.
ఈరాజుచేతిలో నిటుచిక్కినాడ,
నన్నేమిజేసునో నరనాయకుండిపుడు.

నేమైనగాని మ్ము యేమిజేసెదను,
పన్నుగానాత్రాత ఫలమెట్టుచున్నదో.
కానున్న కార్యంబు గాకపోదనుచు,
చింతింపుచుండంగ క్షితినాయకుండపుడు,
సంతోషమలర హంసనుముద్దులాడి,
అక్కున జేర్చితియ్యనీ మాటలాడుచును.
చెక్కిలినొక్కి మచ్చికసేయుచుండ,
భయమెల్లవిడచి భూపాలకునితో హంస.
(*) దమయంతివృత్తాంతమును హంసజెప్పుట
మధురంబుగాబల్కె మనుభాషలను,
ధారుణీశ్వరనన్ను దయతోడవిడచితే.
దమయంతినిపుడునీ తరుణిజేసెదను,
దమయంతివంటి సౌందర్యవతులీమూడు.
లోకంబులను లేరు ప్రకటంబుగను,
పుడమిరాణనీయొద్ద బూటకంబులుబల్క.
పారిపోదునటంచు భావింపవలదు,
ఈసంపత్తి చేనెట్లు సాగునటంచు.
భూపాలచందనీ బుద్ధినుంచకుము,
పురుషులలోనిన్ను బోలినసుందరులు.
స్త్రీలలోదమయంతి బోలుసుందరులు,
ఏలోకమున లేరు భూలోకనాయకా.
నామాటనిజముగా నమ్ముమీమదిని,
నీని త్తమెదాని నీరజగర్భుండు.
ధరణిలో బుట్టించె ధరణీతలేంద్ర,
అనియిట్లుతనతోడ నాహంసబల్కంగ.

నవనీతుడాలించి హాశ్చర్యమొంది,
    రమణీయగమనయో రాజహంసోత్తమా.
నీవుజెప్పినమాట నేడునాచుదికి,
    సంతోషకరమయ్యె సరవిగాదమయంతి.
నెట్లునీవెఱుగుదువు యేరాజపుత్రి,
    అతివనానాకెట్లు సతినిగావించెదవు,
నలతప్రోస్నేహంబు నీకెట్లుగలిగె.
    సక్షివిగావునా పాలిదైవమునీవు.
యీక్షితిలోననా యెలనాగజన్మ,
    వృత్తాంతమంతయును వినుపింపుమనగానె.
యవనీశుతోడనా హంసయిట్లనియె,
    భూపాలవినువిదర్భా పురాధిపుడయిన.
భీమభూపాలుండు భీమవిక్రముడు,
    శ్రీమీారరాజ్యంబు సేయుచునుండంగ.
ధరణీశ్వరునకు సంతానంబులేక,
    తపములునుజపములుచు తగినదానంబులును
యుపవాసములుపెక్కు లొనరించియలసి,
    వనవాసమునకేగి మునినాయకుల.
సేవగావింపుచును కొంతకాలముండగ,
    దమనుండనగనొప్పు తాపసుండొకనాడు.
దర్శనంబియ్యంగ ధరణీశ్వరుండు,
    సాష్టాంగమొనరించి సన్నుతులుగావింప.
దమనమునీంద్రుండు దయతోడబడబల్కె,
    ధారుణీనాయకా ఘోరవనములనీవు,
విహరింపగానేల వినుపింపుమనగ,

శృంగారవనమునకు బోవంగనాలోచించి.
—(*) దమయంతి శృంగారవనమున కేగుట. (*)
చల్లనగుపన్నీట స్నానంబుజేసి,
కురులుచిక్కులుదీర్చి కొప్పుగాగీలించి.
నవరత్నమయ భూషణంబులుధరించి.
బంగారుతాపూల·బొందుధరియించుకొని.
కనకబుటేదారు కంచుకముదొడగి,
జలతారునాయకీగల కుసుంబా.
రంగుచీరెపయ్యెదవేసి శ్రీగంధమలది.
తీరుగానుదుటక స్తూరినామముదీర్చిక,
బొమలమధ్యను పత్సబొట్టుమెరయంగ.
మిసమిసలాడంగ మిన్కుకాటుకరేఖ,
సోగకన్నులయందు సొగసుగాదిద్ది.
ముందువెనుకను కొందరిందుముఖులు,
నడునమానినీమణి మందయానంబుతోడ.
వలనొప్పుశృంగార వనముప్రవేశించి,
చిగురుటాకులుగోల్ల చిదుముచునుమరియు.
మొగ్గలనుజూచి సంమోదంబునొందుచును,
చిలుకలపల్కులకు చెలగిమెచ్చుచును.
పన్నీరుకాలువలపయి నుండిదాటుచును,
కపురంపుదిన్నియలగని మెచ్చుకొనుచు.
కన్నియవేడ్కనిట్లున్న సమయమునందు,
రాజహంసలుప్రవాలె రమణిముంగటను.
ప్రవాలినవుజూచియా వామలోచనమిగుల,
నాశ్చర్యమునుబొంది యతివలనుజూచి.

చూడ రేచెలులార సొగసుబుట్టి,
పడంగనిహంస లెటనుండియిటకువచ్చినవో,
వీటినడకలుజూడ వేడుకగానున్నదే,
నిందులోనొక దానినిపుడుబట్టుకొని.
ముచ్చటల్ దీరంగముద్దులాడగవలయు,
కాంతలారాచుటుగాయుడిమీరు.
నేర్పుతోనొకహంస నేను బట్టుదునంచు,
దమయంతిపలుకంగ తరళాక్షులపుడు.
సయ్యనసునడుములకుపయ్యెదల్ జుట్టుకొని,
కోకముళ్ళుబిగించిరయికముళ్ళు ఘటించి.
జడలుముళ్ళుగ వేసికడు వేగమునను,
తీగెలచాటుననుదాగి చడిగాకుండ.
తారుపనుబోయి యాతరుణులందరును,
హంసలచుజుట్టుకొని యదగుపాటుననంత.
వలనొప్పనన్ని హంసల బట్టిరపుడు,
నలుడుబట్టినయట్టి కలహంసరాజంబు.
దమయంతి చేడిక్కెదయి వయోగమున,
చిక్కలగిదమయంతిమిక్కిలిముదమంది.
(*) హంసపట్టుండిదమయంతితో సంభాషించుట. (*)
మోమునను గదియించి ముద్దాడుచుండ,
కలకంఠిచూచియాకలహంస యిట్లనియె.
వెలదిరోననునీవు విడిచిపెట్టితివ,
వీలుగానొకగొప్ప మేలుజేసెదనీకు.
భామరోనమ్మ నీపాదములతోడు,
అనగనాదమయంతి యాశ్చర్యమునుబొందె.

రాజహంసనుజూచి రమణియిట్లనియె,
మేలుజేసెదనంచునీలుగాబల్కితివి.
ఆమేలుయెట్టిదోయది జెప్పుమిపుడు,
చెప్పిననునిన్ను నేనిప్పుడేవిడచెదను.
యనిబల్కగాహంస యతివకిట్లనియె,
నలనుహీంపతిని నీనాయకునిగాజేతు.
సతతమునియోందియారు దేశములు,
నేలుచునునున్నాడు బాలరోయారాజు.
చక్కదనంబెన్నశక్యంబుగాదు,
నలకూబరునికన్న నలినమిత్రునికన్న.
ననవిల్తుకన్నచక్కనివాడునలుడు,
వానిసుందరమెన్న వాణీశునకు.
నెనవశముగాదమ్మ నేవర్ణింపజాల,
బోటిరోనమ్మునామాట దబ్బరగాదు.
ఆరాజునకునునీవాలి వయియుంటె,
బంగారుపువ్వునకుపరిమళం బున్నట్లు.
పసులలోరత్నంబు సమకూర్చినట్లు,
తియ్యనిజున్నులో తేనెగలిపినయట్లు.
సొంపారగాను మీదాంపత్యమొప్పు,
తగుదాతనికనీవు తగునీకునాతండు.
నిజముగా నమ్ము సింగజరాజగమన,
ఏనేర్పునయిన నాభూనాయకునినీకు.
పతినిజేసెదనన్న పడతియిట్లనియె,
పరమేశ్వరుండిట్లు పక్షిరూపముబొంది.
నామీదకరుణించినలునిగూర్పంగ,

చనుదెంచెకాక నీజగతిలో పక్షులకు.
భూపతుల వర్తనంబులు నెట్లుదెలుసు,.
కడ. వేగ నలమహీకాంతునిసన్నిధికిఁబోయి.
యేగతినైన భూమీశుమనసు,
కరిగించినామీఁదకరుణబుట్టగఁజేసి.
వలనొప్ప జెప్ప వేవానిభావంబు,
ఇకనొక్కమాటనీకెఱిగింతు నిటువినుము.
నలుని కేసతివగుదు నలుడొల్ల ననిన,
వేగనాప్రాణముల్ విడిచిపెట్టెదగాని.
యితరరాజులకొల్లనిదిదిక్కువంబు,
అంతపనిగాకుండ నారాజశేఖరుని.
శీఘ్రముగనాపతినిజేసిరక్షించు,
అనగాహంసయిట్లనియెదమయంతితో.
మరిదీనికెచింతమానవోయన్న,
పడతిరోనలునీపతిసేయునందాక.
నిద్దురబట్టదే నెలతరోనాకు,
అనిచెప్పిసతియొద్ద నాజ్ఞగైకొనిహంస.

—(*) హంసనలునిదరికి మరలవచ్చుట. (*)—

తడవుసేయక వేగతనవారిగూడి,
నలునిచెంతకునేగి నరనాయకునిగాంచి.
వేడుకతోహంస వినపించెనిట్లు,
క్షితినాథవినుమునీసెలవుచొప్పునమేము.
పొందుగాను విదర్భపురవరంబునకు.
జనుదెంచిదమయంతి జలజాక్షులునుతాను.
నుద్యానవనములోనుండగామేము,

మగువనగ్గిరవ్రాలహంసముజూచి దమయంతి.
అతిసంతసమునమున్నందరినిబట్టె,
మీనివృత్తంబుగా మీనాక్షికినిసను.
కోరిదొరకితినయ్య కువలయాధీశ,
దానిచక్కదనంబుతలప నాశ్చర్యంబు.
వాణీశునకునైన వశముగాదెన్న నే,
కప్పగాలేను నెలతసౌందర్యంబు.
చూచితనునిజమునుచు తోచునీమనకి,
సుందరితోడనీసుందరాకారంబు.
వరసగాపలుమారు వర్ణించిచెప్పి,
ముదితకునునీమీద మోహంబుబుట్టించి.
చెలినినీసొమ్ముగా జేసివచ్చితిని,
కడువేడ్కతోడనాకాంతను బెండ్లాడి.
పొలుపొందసౌఖ్యముల్ బొందుభూనాథ,
ఇంతలాధీశమాకింక సెలవిప్పించు.
పోదుమనంగ నాభూనాయకుండు,
అపరిమితానందుడగుచు హంసనుజూచి.
నీయట్టియుపకారి నీయట్టిసఖుడు;
ప్రాకటంబుగమూడు లోకంబులను లేడు.
నిన్నువర్ణింపంగ నేజాలనింక,
అనిచాలవినుతించి యారాజశేఖరుడు.
పక్షులకు సెలవిచ్చిపంపించెనంత,
హంసలన్నియుగూడి యావిదర్భపురికి.
తక్షణంబరుదెంచి దమయంతిగాంచి,
చెలియరోనీయొద్ద సెలవుగైకొనిమేము.

లయ మెుప్పనిషధా పురంబునకుఁబోయి,
నలమహీపాలకుఁడునయ మెుప్ప శృంగార.
(*) హంసలు దమయంతికడకు తిరిగివచ్చుట. ( )—
వనములో హరింపవానిమ్ముందటను,
వాలంగమముఁజూచి వసుమతీనాయకుఁడు.
ముదముతోననుబట్టి ముద్దులాడంగ,
వానిసౌందర్యంబునా నిరసికత్వంబు.
వానిగాంభీర్యంబువానిభోగంబు,
వానిచాతుర్యంబువాని యౌదార్యంబు.
వానియాకారంబువాని సద్గుణము,
కనులారగాఁజూచిజన నాయకునితోడ.
నీరూపవిభవంబు నీవిలాసంబు,
నీదుచతురత్వంబు నీమందహాసంబు,
నీదులావణ్యంబునీసొంపు పెంపు.
అసమానమమనుచు నెన భీమతిసేయంగ,
పొందుగానడునీయందు మోహించి.
నిన్ను బెండ్లాడంగ నిశ్చయంబొనరించె,
నీపాదములసాక్షి నిజముగానన్ను.
ఓరాజవదననీవారాజ శేఖరుని,
హావకాంబులో బెండ్లియాడవోయమ్మ.
అలివేణిరోమాకు సెలవుసెయ సేయు,
మీపోయివచ్చెదమన్న పొలతిమోదించి.
హంసనుముద్దాడియధికంబుగాబొగడి,
సెలవిచ్చి పంపించె కలకంఠియపుడు.
జలజలోచనయొద్ద శెలవుగైకొనిహంస,

తనవారితోఁగూడి తనతాపుకరిగె.

—(*) నలుడువిరహతాపము నొందుట. (*)—

అంతనక్కడనలుండతివసుపలకొని,
కంతునిశరములకుగాసిల్లి యపుడు.
ధరణీశ్వరుండుకందర్పతాపము,
కోర్వజాలకధైర్యంబుదూలియిట్లనియె.
భీమభూపతిపుత్రిబిసరుహాయతనేత్రి,
దమయంతినెపుడుపొందగ గలుగునాకు.
ఏమిసేయుదునటకునెవ్వరినిబంపుదును,
యనియిట్లుదలపోసి యామహారాజు.
విడియంబుసేయకను వేటకైన,
పురంబువెడలకనుతనయొద్ద వేశ్యలాడంగ.
చూడకనుచదరంగ మాడకను,
మదిచింతవిడకను మంత్రులనుయిట్లు.
పలుమారునలరాజు కలవరింపుచునుండ,
మంత్రినాధుడుచాల మదిచింతనొంది.
వినయంబుతోఁశభూ విభునిజేరగబోయి,
భయభక్తులొప్పంగ బల్కెనిట్లనుచు.
ఇదియేమిజననాథ మదివివేకమువిడచి,
వనితకైధైర్యంబు వదలంగదగునె.
నీవుదలచితే నిఖిలకార్యములెల్ల,
నవలీలనమకూడు నవనీశతిలక.
సెలవైతెనేనిప్పుడల భీమనృపునితోఁ,
కలసిమాట్లాడియాకన్యకామణిని.
ప్రాకటంబుగదెచ్చి నీకుకళ్యాణంబు,

గావింతులెన్నునుచు గరపంకజములు.
బట్టిలేవగ నెత్తియెట్ట కేలకుసఖా,
సింహాసనాసీనుజేసి హితమైన.
మాటలాడుచునుండె మరియావిధభంగాలో,
భీమభూపాలకుని ప్రియపుత్రియైన.
దమయంతి విరహావేదన జెందిమదిగుంది,
చెలికత్తెలనుజూచి చెలియయిట్లనియె.
చెలులారవినరెయా నలమహీపతినన్ను,
యెన్నడు బెండ్లాడు నేమి సేయుదును.
వేగంబె నలమహీ విభునియొద్దకుమీరు,
జనివినయంబుగా జననాసుతోడ.

—(*) దమయంతివిరహము. (*)—

నామోహమెఱిగించి ప్రేమబుట్టగజెప్పి.
తొందరగానిటకు తోడితేరమ్మ.
అతడురాకున్న నే నితరభూపాలురకు,
మనుదానగాను నాతనువువిడచెదను.
వనితలారనలమహీపతి నన్నుప్రీతితో,
వరియింపకున్న నాహృదయమేలనమ్మ.
మేడలునాకేల చేడెలునాకేల,
హారంబులేలనా హారంబదేల.
చక్కనినంబేల జవ్వనంబికనేల,
భాగ్యంబులేల నాయోగ్యమింకేల.
అనిపల్కుచుండంగ నంతఃంతకు,
మదనతాపంబుబుట్టించి తరుణిమూర్ఛిల్లె.
అంతలోదెలివొంది యతిమోహమునుజెంది,

దిగ్గునను లేచి నల్ దిక్కులను జూచి.
పెదివెలుతడియారి బీటబీటలు,
బారికన్నీరుచెక్కులను కాలువగట్టి.
చన్నుగొండలమీాద జలజలరాలంగ,
వీణవాయించిన విధముగానేడ్చి.
కటికనేలబరుండి గడగడవడకంగ,
బడతులందరుజూచి కడుభయంబంది.
తత్తరఁడిచెలిని యెత్తుకొనిపూబాన్పు,
నందుంచియొడలకును చంగనముబూసి.
ఆచాలనోదార్చి యంతఃపురము జేర్చి,
శయితోపచారములు సేయుచుండంగ.
కొంతసేపటికినాయింతి కన్నులుమాడ్చి,
నిదురింపగానపుడు సుదతులందరును.
దమయంతివిధమెల్ల ధరణీశ్వరునితోడ,
జెప్పకుండినమనకు తప్పితమటంచు.
భూపాలకునికడకుఁబోయి యాచెలులెల్ల,
విన్నవించిరిమహా వినయంబుతోడ,
ధాత్రీశచంద్ర నీపుత్రిసంగతివినుము,
నేరాకంబుమీారంగ మొన్నటిదినంబు.
అంగనయనుమేము శృంగారవనికేగి,
విహరింపుచుండంగ నినువీధినుండి.
రాజహంసలుకొన్ని రయమొప్పనేలించి,
పొందుగానీపుత్రి ముందుటనవ్రాలె.
అందు కోనొకహంస నలివేశిపట్టుకొని,
ముద్దుమెప్పుగాదాని ముద్దాడుచుండ.

(*) దమయంతివృత్తాంతమును భీమునితోఁ జెప్పుట.(*)

మగువనుజూచి యామదహంసరాజంబు,
    నలునియందెరవు వర్ణనజేసి మరియు.
వనితకానలునిపై వలపుబుట్టగచేసి,
    విడిపించుకొనపోయె వేగమాహంస.
అంతనుండియునాబల నంతగాదమయంతి,
    చింతచేనలునిపై జిత్తంబుజేర్చె.
అంతకంతకుమోహ మగ్గలంబయ్యె,
    నిక చెలియవిరహంబెల్ల జెప్పెదమువినుడి.
కన్నులనిండారగారు నెప్పుడునీరు,
    తరుచుగాతడియారు తరళాక్షినోరు.
సంగీతములు వినదుసరస్నానములు,
    దినదువిరిదోటలకు జనదువింతలనుగనదు.
మగువలలుగూడదు మదిచింతవిడదు,
    పాటబాడదు మాఱుమాటాడదెపుడు.
నమలంబుసేయదు కమలముల్ గోయదు.
    కన్నులుమూయదు గడియసేపైన.
నీముట్టదుశిఖనువిరులు బట్టదువంట,
    నగలంబెట్టదు మహీనాథనీపుత్రి.
వేడినిట్టూర్పులనువెడల యెఱ్ఱని పెదవి,
    కమలినల్ల గనయ్యెకంజాక్షికిపుడు.
వలిగాసోకి తేమలికులికి పడుచుండు,
    తుమ్మెదలురొదసేయ దుల్లిపడుచుండు.
మగువకాతాపంబు మాన్పనోయు,
    మేమువారకశైత్యోపచారములుచాల.

జేసితివని యెన్నజెప్పిన మహారాజ,
యాత్పురంబునందు వాలింపవయ్య.
మంచిగంధముదెచ్చి మగువకుబూసితే,
గందిపోతుంగణమందు కస్తూరియయ్యె.
మల్లెపువ్వులపాన్పు మదిరాక్షికిని వైవ,
మాడిపత్తులపయ్యె నసుమతీనాథ.
ముత్యాలసరములా ముదితకున్వైవంగ,
మేలయినముత్యముల్ నీలంబులయ్యె.
పన్నీరుగదెప్పించిపడతి నెయ్యునజోయ,
కుతకుతపానియుడికె కువలయాధీశ.
చన్నీళ్ళకాగులో కలజూతినించితే,
వింతగాజన్నీళ్ళు వేడెక్కెనయ్య.
చిగురుటాకులమీదచెలియను జేర్చితే,
పొగనుగానెలమైనా చిగురాకులెల్ల,
తరుణీమణికిమగనతాపంబు రెట్టించె,
మగువనుపోషింపమాచేతగాదు.
ధాత్రీశవినవేకు పత్రికావలసితే,
చలువమెప్పగా వేగ సఖినిరప్పించు.
రాజేంద్ర సూర్యుడు రాకుండ నపత్రి,
బ్రదుకదని మోడియాశేపకు లేశంబు.
ఉన్నచందముగాకు విన్నపముచేసితిని,
[illegible] చిత్తమగగ భూవిభుడు.
నిశ్చేష్టుడై [illegible] నిమిషంబు మూర్ఛిల్లి,
[illegible] నిట్టూర్పువెచ్చి
వెంటనే [illegible] మేడకుబోయి,

పొందుగానదమయంతి చందంబుజూచి.
తలయూచుయపుడుభూతల నాథచంద్రుండు;
నతిరయంబుగ నేగెనాస్థానమునకు.
(*) భీబుడుమంత్రులతో నాలోచించుట. (*)—
వాసిగాసింహాసనాసినుడైయుంగ,
మంత్రులబిలపించి మహావాక్యమును.
వింటిరేనేడొక్కవింత కార్యము బుట్టె,
మొన్నటిదినంబు నాముద్దులకుమారి.
శృంగారవనమందు చెలులతో విహరించి,
గడువింతగానపుడు గగనమందుండి.
కొన్నిహంసలువచ్చి కోమలిముందు బడుచు,
వ్రాలంగదమయంతి చాలమోదించి.
తనుగట్టుటకుర్త్రాళ్ళు తాదెచ్చుకున్నట్టి,
చందమునదమయంతి యందుబోవొక్క-
హంసనుబట్టుగొని యక్కునగనయించి,
ముద్దులాడుచుండ మునమొప్పగాను.
నలునిసుందరము వర్ణనజేసి,
నీకతడుతగినవరుండనుచు దమయంతితోడ.
జెప్పిమోహముబుట్టుజేసి హంసలతోడ,
తప్పించుకొనిపోవ దమయంతికన్య.
చిత్తంబునలునిపై జేర్చి మోహముంచి,
ఆహారముడిగి నిద్రాపేక్షమాని.
తోటిబోటులతోడ మాటలాడుటమాని,
మతిదప్పియుండెనని మగువనీవేళ
నెరిగించిరికదీని కేమిసేయుదగు...

నలునిరప్పింపంగ నాచేతనానే.
బలవంతముగ నియ్యపసువులోనము,
నచ్చుబలవంతునిబిలువ బంపగబలము లేదు.
ఆడుపిల్లలగన్న యట్టిమానవులకును,
పరువుమర్యాదలును పౌరుషంబులును.
చెడునంచుబుధులెల్ల జెప్పినవాక్యముల్,
తడయకనిజమాయె నసుయంతివలన.
పుడమిలోనెందరో భూమీశులుండంగ,
నలునిగోరంగ యీనాతికినితగునె
నలుడనగానర్వ నారాయణుడుగాని,
సామాన్యుడేమనకు చర్చించిచూడ.
మోహానాంగకెట్టి మూఢతచెల్లునే,
వేరొక్కధారుణీ విభుగోరరాదె.
భూదలంబునస్త్రీల బుద్ధులుప్రళయాంతమని,
శాస్త్రములుజెప్పు నవియేలతప్పు.
ఏమిసేయుదునిందు కేదియుపాయంబు,
మంత్రిశేఖరులార మరిజెప్పవయ్య.
అనిబల్కగొంతసే పాలోచనముజేసి,
మనుజేశుతోడ నామంత్రులిట్లనిరి.
భూపాలమీకన్న బుద్ధిమంతులులేరు,
యింతమాత్రంబునకు జింతింపనేల,
అవనీశయొకయుపాయం బిందుకును,
గలదుమనవిజేసెదమిపుడు మదిజిత్తగింపు.
కరమొప్పదమయంతి కన్యకామణికిపుడు,
వాసిమీరగ స్వయంవరమహోత్సవము.

గావింతుమనుచునీ భూవలయంబందు.
గలరాజులకు వెలయగాజాటబంపు.
తప్పకరాజులందరు వచ్చెదరుమరియు,
నయమొప్పనలమహీ నాయకుడువచ్చు.
వచ్చిననమయంతి వరియింపగావచ్చు,
నీవిధంబున గార్యమీడేరుమనకు.
మాకుదోచినరీతి ననవిజేసితిమిపుడు,
నటుపై కితమచిత్తమని పల్కగాను.
జగతీశ్వరుడునుహా సంతోషమునుబొంది,
మంత్రిబుద్ధికిచాల మదిలోనమెచ్చి.
—(*) స్వయంవరముచాటబంచుట. (*)—
చారులనుబిలిపించి ధారుణీపతివల్కె,
నలరాజుమొదలయిన నరనాయకులకు.
దమయంతికిపుడు మోదముతో,
స్వయంవరంబనిజెప్పి వారిరమ్మనుచుప్రార్థించి.
వేగరండనిపల్కి వేడ్కలోభీముండు,
కరమొప్పబురము శృంగారంపుడనుచు.
తనమంత్రులకుజెప్ప తత్క్షణంబున,
వాడపట్టణంబున జాటపంపించినిపుడు.
పురవాసులెల్లసొంపుగవీధివీధులను,
పన్నీరుచిలికించి బహు విచిత్రముగ.
జెలువొప్పగాబురము శృంగారమొనరించి,
సంతోషమున నుండచారులంతటను.
నిరుపమానంబయిన నిషధాపురముజేరి,
నయమొప్పనలమహీ నాయకునిగాంచి.

వంశసంబుజేసి సుమతీరాయకాశీక్షితిని,
    విదర్భాధిపతిపంపెనమ్ము.
ఆమహారాజునకు నాత్మసంభవమైన,
    గను-దమంతికిస్రుడు నొసఁగముగ మానృపతి.
నలునొప్ప గాస్వయంవరమహోత్సవ,
    మొప్పగావింపదలచి వేగముగనివ్వార్తఁ.
తనసన్నిధినివిన్నపముచేసి యిమ్ముటకు,
    రమ్మని ప్రార్థనంప మమ్ముఁబంపించె.
దేరాకపశించి వేవేగవిచ్చే,
    యనవలెనంచుజెప్పి భూపదునాజ్ఞగొనుచు.
వాసిగాచెప్పున్న దేశాధిపతులకును,
    నెరిగించియాచారు లరుదెంచిరప్పుడు.
అంతటనలమహీకాంతుడీశుభవార్తఁ,
    వినిమహాసంతోషమును బొందిహరియు.
తనమంత్రితోడనం తనమొప్పనలరాజు,
    వేడుకనీవార్తఁ వినుపించెనప్పుడు.

—(*) నలుడువిదర్భకు వెడలుట ( )—

పొందుగావిదభఁ ఫురవరంబునకిపుడు,
    మూటిగాబైరమని బాటించుమనియె.
ధరణీశురాజ్ఞ నొదలనుంచుకొని,
    మంత్రిసరగునపురములో జాటించెనంత.
అంతలోపుర యుత్తనంతావళంబులును,
    హొదాలకొనవచ్చి హాజరుగనుండె.
గాయకఘగురాలు వరుసగానేతెంచె,
    రథములువచ్చెసారథులతోనపుడు.

గాయకపండితకవినందిమాగధులు,
    నలువైణికామాత్య భటసముదయంబు.
ఒప్పుగానరుదెంచె జెప్పన్న దేశాధి,
    నాయకుల్ వారిసేవకులతోడఁగాఁగ.
నలమహీకాంతుఁడా నరనాయకులకెల్ల,
    మర్యాదగావించి మరివేడుకలర.
ఆదిత్యసంకాశమైన రథంబెక్కి,
    జననాథులందరును తనవెన్కరాఁగ.
గొమరొప్పసానిమేళములు నృత్యముసేయ,
    భటులుకొందరు బరాబరుసేయంగ.
నలుడేగుచుండంగ నారదుడునీక్షించి,
    దేవలోకంబునకు వేవేగఁబోవ.
మునిరాకగలమహా ముదమొప్పగా,
    నపుడు దేవేంద్రుడవ్వేళ దేవతలుతాను.
ఎదురుగానేగినారదుని పాదంబులకు,
    సాష్టాంగమర్పించి సద్భక్తితోడ.
తోడుకొనివచ్చి తా వేడుకతో,
    సభామంటపంబుననొక్క మణిపీఠమందు.
నాసీనుగాఁజేసి యర్ఘ్యపాద్యములిచ్చి,
    పూజింపనారదుడు పురహూతుఁజూచి.
పాకారివినుము భూలోకంబులో,
    నొక్క వింతకార్యమొకటి సవరింతునిపుడు.
పుడమిలోనవిదర్భాపుర నరాధిపుండయిన,
    భీష్మకుఁడనగనొప్పు నామహీశునకు.
దమయంతియనగ సుందరగాత్రిజన్మించె,

దానిసౌందర్యంబుతరమె వర్ణింప.
మూడులోకములనేజాడతి కన్యకల్,
లేరుచెప్పెదవినుము వేరు వేరుగను.
వాణిజూచితినిరుద్రాణిజూచితి,
విష్ణురాణీజూచితినిం ద్రాణీజూచితిని.
రతినిజూచితినరుంధతినిజూచితి,
సత్యవతినిజూచితి చంద్రమతినిజూచితిని.
సురకామినులనెల్ల జూచితినీమేనకను,
జూచితితిలోత్తమనుజూచితి నిరంభ.
గరుడకిన్నరయక్ష గంధర్వకాం,
తలనునాగకన్యకలనే నయమొప్పగంటి.
ఆసతులుదమయంతితోసమానము,
గారుగణుతింపరూప రేఖలకుసురనాధ.
అయింతినలమహీనయకునీ మోహించె,
నందుకై తనతండ్రియగు భీమనృపతి.
వరపుత్రికిని స్వయంవరమనిచాటింప,
నలుడాదిగాగల్గు నరనాధులెల్ల.
ఆవిదర్భాపురికిబోవుచున్నారదే,
యీశుభవార్త నీకెరుగింపనేను.
వచ్చితినీవునాయుత్సవంబునుజూడ,
బోయినమేలగును పురుహూతయనుచు.
జెప్పియానారదుడు శీఘ్రంబుగా,
నప్పుడంతహితుండయ్యె నద్భుతంబుగను.
సురనాయకుండంత వరుణపావక,
యమలముప్పరగనిపల్కెముదమొప్పగాను.

నపుడుభూలోకమున కేగిదమయంతి,
    మనలోననొకరుసమ్మదమొగాను.
వరియింతీమనిపల్కి వారలను దోడ్కొనుచు,
    మహికేగు దెంచెవిమానంబులెక్క.
రయమొప్పగావిదర్భా పురంబును,
    జేరిపొలుపొందతమరూపములు నెవ్వరికిని.
గావరాకుండనాథునులొక్క యెడనుండ,
    నంతలోపల నలుండాదిభూవిభులు.
ఘనవైభవంబుతోడను విదర్భాపురము,
    దరిజేరగాభీమ ధరణీశ్వరుండు.
సంతోషమునమంత్రి సహితముగ,
    నెదురేగిధరణీశ్వరులనెల్ల తనపురంబునకు.
వినయంబుతోడ గొడ్కొనివచ్చి,
    వారలనువేర్వేరసౌధముల విడియించెమరియు.
తానేగిత్వరగనాస్థాన మంటపమందు,
    మంత్రులతోగూడి మోహ్లాదించుండె.
దేవతల్తపతను దివ్యరూపములతో,
    నిలరాజుమునుపటను నిలువంగిజూచి.
దేవతలనియెంచి దిగ్గునతాలేచి,
    సాగిలబడిమ్రొక్కి సన్నుతుల్ చేసి.
సురనాయకునిజూచి ధరణీశ్వరుడుపల్కె,
    బాకాడివినుము నాభాగ్యమూలమును.
మిాహాత్మ్యంబయ్యె మేదినినావంటి,
    ధన్యులులేరు వాస్తవమొప్పగాను.
పూర్వంబునేనెట్టి పుణ్యంబుజేసితినో,

తెలియంగజాలనో బలదైత్యహరణ.
వాసవామీరు విచ్చేసినకార్యంబు,
నాతోడజెప్పితే నాశక్తికొలది,
నొనగూతుఁగాననివల్క జననాయకునిజూచి,
నవ్వుచువాఁడల్కె నాకేశుడంత.
—(*) ఇంద్రుఁడు నలుని దూతగాఁగోరుట. (*).
జగతీశవినుమునీ సత్యమీలోకంబు,
నిండియుండుటజేసి నినుజూచువేడ్క.
మేమునచ్చితిమయ్య భూమీశమరియొక్క.
కార్యంబునీవల్ల గానలసియుండి.
కడువేడ్కతోడనీ కడకేగుదెంచితిమి,
మాకార్యమొనరింప నీకన్నగలరె.
కరమొప్పదమయంతి కన్యకామణికిపుడు,
నలనొప్పగాస్వయం వరమనుచుమేము.
వినిదానివరియింప వేడుకతోనిపుడు,
నలుగురముసుదెంచి నాముసీకడకు.
దయతోడనీవునా దమయంతికడకేగి,
యాలోననొకరి సమ్మదమొప్పగాను.
వరియించలాగునా వలజాక్షిబోధించి,
వచ్చితేనినుజాల మెచ్చెదముమేము.
భూవరానీవట్లు గావింపకుండినను,
నీపై నిమాకిపుడు కోపంబుపుట్టు.
అనియిట్లు దేవేంద్రు డానతిచ్చిననలుడు,
తెలతెలపోయియా బలభేదికనియె.
ఇదియేమి దేవమీ రిటునంటికార్యంబు,

నాకుజెప్పఁటమీకు న్యాయంబుగాదు,
తొల్లి యారామమంత్రికి నాకుఁ బరిచయము,
కలదయ్య మీరెఱుంగని దేమిగలదు.
అంబరుభూనాథు లరుదెంచుచందమున,
జనుదెంచినాఁడనో జంధారి నేను.
అనిన నేనిపుడు మీయాజ్ఞప్రకారంబు.
నాతోడఁ జెప్పి దేవ నామాటవినవలె.
దేవేంద్రవినుమునీ సేవజేసెదగాని,
మగువ నీమీకుఁ గూర్పఁగఁ జాల నేను.
క్షితినిట్టిపనులు నేర్పిన వారిఁబంపించి,
యాయింతి వరియింపుఁడయ్య మీరిపుడు.
ఇట్లుపల్కితివంచు నిపుడుకోపము సేయు,
ధర్మముగాదయ్య దయయుంచరయ్య;
అనియిట్లు భూనాథు డతివినయంబుగా,
బల్కఁగఁ గోపించి బలభేదిపల్కె.
అవనిలో రవివంశమునందు బుట్టినవారు,
బహుసత్యవంతులని ప్రఖ్యాతిగనిరి.
అట్టివంశంబునం దమరంగనీకిప్పుడు,
పుట్టె దబ్బరలాడ బూనుకొనినావు.
యిట్టివాక్యటంచు నరిగితే మేమేల,
ఒప్పదుమాచ్చదనుయ్య యినవంశతిలక.
తెంపుచచ్చినకార్య మొరిగించితేనిపుడు,
చేసెదవంటివే క్షితినాథనీవు
అకలంకప్రతిని మేమొకపనికిఁబొమ్మన్న,
బోలేకనింతలో బొంకితివినీవు.

నీదయమామీఁద లేదేమి జేసెదము,
   పోదువనంగ నాభూశురుఁడప్పుడు.
చిన్నబోవుచు రెండు చేతులజోడించి,
   వాకేశుతోఁదదా నయముననుబల్కె.
పాకారినీవునాపై గోపగింపకను,
   వినవయ్య నేజేయు విన్నపంబిపుడు.
దమయంతియున్న సౌధముచుట్టు,
   పదివేలభటులు కావలియుం..నటకెట్లుబోదు.
ననిపరిశయంబుచే నుసవిజేసితిగాని,
   మరియేమిగాదు శ్రీహరిసాక్షిగాను.
పూబోణికడకునే బోవనుపాయంబు,
   నెరిగించితేబోయి తరళాక్షితోడ.
సంభాషణముజేసి సఖినిమీఁగోనొకరి,
   కనుకూలపరచినే జనుదెంచుననగ.
సంతసంబునశచీ గాంతుడునలుసహీ,
   కాంతునితోబల్కె గడుప్రియంబుగను.
పద్మాక్షితోషనీవు భాషించినీవిటకు,
   తిరిగివచ్చేవరకు నరులెవ్వరికిని.
పరగనీరూపు గన్పడకుండుమరియు,
   నాదమయంతికన్యకును దానియింతులకు.
కరమొప్పనీరూపు గనుపించపొమ్మనుచు.
   వరమిచ్చిపంపంగ వసుధేశ్వరుం.డు.

—(*) నలుండుదమయంతికడకు క..త్రగాజనుట. (*)—

నకలంకమతితోడ నాభీనునరపాలు,
   కోటలోపలజొచ్చి సూటిమీఱంగ.

నిండుశీలాబ్ధ సుచిరంబయినట్టి,
దమయంతినగరు మోహముతోడఁజొచ్చి.
అచ్చోటదనమ్ముట్టు నెచ్చెలుల్ గొలువంగ.
గరము ప్రాకారు ముకుపుచంపమున.
నున్నయాదమయంతి సర్వేశ్వకాంత,
గాంచికన్నులుమిరుమిట్లు గల్గినిమిషంబు.
ఆశ్చర్యపడిధైర్య మవలంబనము జేసి,
మునమ్ముతో దమయంతి నెదుటనిలుచుండె.
దమయంతియప్పుడు నాతలవాధుఁజూడగాంచి,
యాశ్చర్యచిత్తయై యాక్షణంబందు.
గద్దెపైనుండియా కల్కిదిగ్గున లేచి,
యొకమణిస్తంభంబునకు చాటుగాను.
నిలుచుండియుండంగ జెలిమిక త్తెలుజూచి,
నలరాజుతోడ గ్రన్ననబల్కెరిట్లు,
ఓమహాపురుష నీనామధేయంబేమి,
స్థలమేది మరియునీ కులమేదినీవు
ఇంద్రుండవో పూర్ణ చంద్రుండవో లేక,
పద్మమిత్రుండవో పంచబాణుండవో
కరమొప్ప పోతుటీగలకయినజొరరాని,
మాగారా శివారమున నెట్లువచ్చితివి.
ఇటకువచ్చినకార్య మెయ్యదియోదెల్పు,
మకలంకమతి వీనులకువిందుగా
అనిచెలులుపలుకంగ నవనీశ్వరుండప్పుడు,
దమయంతిజూచి మోహముతోడబల్కె.
రమణినేనినిషధా పురంబేలువాడనే,

నలుడందు రేనన్ను నలినాయతాక్షీ.
మగువనీతో గొన్ని మాటలాడగవలసి,
చనుదెంచినాడ నిజదూతనగుచు.
వాసవుండుయముండు వరుణుండుపావకుడు,
నలుగురునినుగోరి నాయొద్దజేరి,
వారిలోనొకని వరియించురీతిగా,
నినుబోధసేయుమని ననుబంపినారు.
వారుపుణ్యాత్ములును వారుశ్రీమంతులును,
వారుమహోత్తములు వారుపావనులు.
వారుజరామరణ వర్జితులుశ్రీయుతులు,
వారలునినుగోరి వచ్చిరోబాల.
క్రతువులుదానములు వ్రతములుశుభోక్తివ,
వాసముల్జపములును వరతపంబులును.
విప్రసంతర్పణలు వేదపారాయణలు,
దేవతార్చనలాదిగావించువెల్ల.
స్వర్గమందున విహారంబుకొరకేగదా,
యట్టివారలకైన నదిదుర్లభంబు.
దేవతలకునీవు దేవిగానుంటేని,
వైభవంబెన్నగా వశంబగునె.
పొలతిరోయిప్పుడు నీబుద్ధినాలోచించి,
వారిలోనీవు నెవ్వరిని వరింతువో.
చెప్పవేయిటు నీ కౌచవులుగుండువుగాగ,
నవిపల్కి యంతట యాంతలాభుని.
గాంచివెంబడిబోయి కనిసగ్రగ్గనగను,
గద్దెస్వర్ణముగా గాంచెనట్లసెనె.

నలచరిత్ర - పదము.

ఔనయ్య మంచి కార్యము జెప్పినావింక,
మెచ్చవచ్చును నిన్ను మేదినీనాథ.
అలపాపజాతిహంసలు వచ్చినా యనను,
భ్రమపాలుగా జేసి పారిపోవంగ.
పక్షులమాటలకు భ్రమనుజెందివెఱ్ఱినై,
అంతనిధనంబునకు నాశించినట్లు.
చిత్తంబు నీయందు జేర్చి నేనాహార,
నిద్రలు వర్జించి నిరతంబు నిన్ను.
దలచి కృశింప నాతండ్రిగారికి దెలసి,
నిన్ను రప్పించుటకు నిఖిలరాజులకు.
నమరస్వయంవరంబని చాలబలపించె,
నాప్రయత్నంబెల్ల నరనాథ నీవు.
నిష్ఫలంబొనరించి నిజరాధిపులను,
వరియింపుమని జెప్ప నరుదెంచినావు.
నిను సదసేయంగ బనిలేదు నాపూర్వ,
కర్మము దప్పింప గలరె యెవరైన.
దేవేంద్రుడాదిగా దిక్పాలకులు నాకు,
తండ్రులైననుగోర తగునె వారలకు.
వారినెవరియింప ఘోరపాపము గాదె,
వారికి బిడ్డనై వర్తింపుచుండి.
పుణ్యపాపములెల్ల పూర్ణంబుగా దెలసి,
యిట్లాడ నీనాలు కెట్లాడెనయ్య.
వృషభములు గోవులు భార్యలో వగుగాని,
వృషభములు గోవులు వచ్చనిన చుంచు.
బుధులు జెప్పుదురు నాబుద్ధి పెడతలబుట్టి,

నేనిన్ను గోరితిని మానవాధీశ.
నిక్షిప్తమయియుంటె నీవెనన్నువరింపు,
నట్లువరించనీ కనుమానమైతే.
భూవరాసభలోన దేవతలుచూడంగ,
నిన్ను నేవరియింతు నీకేలభయము.
అట్లయినననన్ను బెండ్లాడకనుంటివా,
నీవువారునమెచ్చ నిమిషంబులోన.
ప్రాకటంబులను తృణప్రాయంబుగా,
విడతువారికిని కంతకోరికలదీరు.
యింకనాతోనీవు యేమిజెప్పినగాని,
వీనులచొరనయ్య మానవాధీశ.
మానుమాటాడకను మరలిపొమ్మికనీవు,
భగవంతుడేమి సేయగలదలచినాడో.
మగువయాగతిబల్కి మౌనంబుదాల్పంగ,
మదిచిన్నబుచ్చుకొని మరలెనలరాజు.
చెలియరోనలరాజు చెప్పినవాక్యముల్.
అతనితోదమయంతి యన్నవాక్యములు.
అమరులదృశ్యులై యచ్చోటికరుదెంచి,
వినిమెచ్చినలునికన్న మున్నునేగి.
తొల్లింటియట్లుండ మెల్లమెల్లగనలుడు,
జనుదెంచిసురలకును సాష్టాంగమొరగి.
లేచిసురపతిదిక్కుజూచి చేతులుమొగిచి,
అనులేశకమును మీయాజ్ఞ శిరమందు.
ధరియించుకొనినేను దమయంతికడకేగి,
వనజాక్షిలోప వినావె భంగంబుల.

పొగడి వేనిధములను బోధ జేసినగాని,
చిత్తగించుకసతికి మెత్తబడదయ్యె.
దమయంతియిమ్మెల్ల తండ్రులగా నెంచి,
నామాటవినదయ్యె నాకాధినాథ.
ఏమిసేయుగునిందు కేదియుపాయంబు,
సెలవీవ వేయనగ బలభేదిబల్కె.
మానవాధీశ్వరా మాయమర్మము లేక,
యలివేణితో మాట లాడ టనిజంబు.
ఇట్టిసత్యవ్రతులు నిట్టి సద్గుణమణులు,
లోకమందున లేరు నీకుచెప్పంగ.
దమయంతినీవు మోదముతో వరియించి,
చిరసౌఖ్యములబొందు క్షితినాథయనుచు
తగబల్కి సురలు నంతర్ధానమును బొంది,
యొరులకగపడకుండ నుండిరొకచోట.
అంతటభీముండు సంతసంబున గొప్ప,
మేలయినపట్టుశ మేనాకులోన.
ముదమొప్ప తెల్లని ముఖమాలుజరిపించి,
జీ దంతంపు కుర్చీలు వేయించి.
పదమలచులిని యేబదియారుదేశాధి,
పతులనుబిలిపించి క్షితిదాయకుండు.
వసుధేశ్వరుల గౌరవంబులకు తగినట్లు,
కూర్చుండగాబెట్టె గుర్చీలపైని.
ధారుణీశ్వరుడంతదాదులను బిలిపించి,
దమయంతికభ్యంగనము జేసి వేగ.
భూషణంబులుదాల్చి పద్మినిముందు.

భవ్యమహాపార్వతీ భవనంబునకును.
వెంటదీసుక నేగి వెలది చేనాగౌరి,
దేవికి మ్రొక్కించి వేవేగమిటకు.
తోడి తెండనగ నాచేడియలతివేగ,
నను యంతకపుడు మోదంబుతోడుకను.
పద్మాక్షియొకతె సంపంగి తైలముతోడ,
తలయంటెనొకతలో దరినలుగు బెట్టె.
—(?) దమయంతిని అలంకరించుట. (.)—
కొనరొప్పనొక భామకురు చిక్కులుదీర్చె,
బికవాణియొకతె జిడ్డు బీరరసముఁబోసె.
తలిరుఁబోడియొకతె తలకుఁద్దెనొక భామ,
చలువపన్నీటితో జలకంబులార్చె.
పొలుపారనొక కాంతతర యొడల్ తడియార్చె,
మడుగుచీరనొసంగెఁబుదిరాక్షియొకతె.
లోలాక్షి చురియొకతె ప్రేలాడుశిఖవేసె,
తిలకంబు నెన్నుదుట దిద్దెనొక యింతి.
కమలాక్షియొక్కతె కనుల కాటుక బెట్టు,
భామినీయొకతె ధూపము వేసె పతికి
నిగ్గుబంగరు ఝరీ మొగ్గలు గలపట్టు,
తాబందుగట్టించె వరశాక్షి యొకతె.
తళతళ మెరయుజల్తారు పువ్వులనల్ల,
పట్టురవికె యుదొడగె భామయొక్కతె.
రత్నాలచేర్చుక్క రాగిడి నెలవంక,
గొప్పముత్యము ముక్కుపుడక గొలుసులును.
పాపిలబిందీలునవటు సూర్యచంద్ర

చీరముత్యములగూర్చిన మెరవిరేకు.
ఘనమయినవజ్రాల కమ్మలునుజునుకముల్,
ముత్యాల తాటంకములు కర్ణపూలు.
ఎచ్చయినముత్యాల కుచ్చులబావిలీలు,
కడుసుందరంబయిన కాన్బావిలీలు.
నీలంపుబావిలీలు మేలుపచ్చలరవలు,
గూర్చినబావిలీలు గుమ్ముటీలుమరియు.
పాలెపట్టెడయు ముత్యాలపట్టెడగొప్ప,
నానుపట్టెడ మహోన్నతగిల్కసరుల.
పల్కసరులును మరియుజిల్కలతాళీలు,
బహుమణులుజెక్కిన బంగారుకంటె.
గగనమందునధగద్ధగ మెరయునక్షత్ర,
ములకాంతినొప్పు కెంపులరవలజిగిని.
పోలుపైననేవళంబులు బన్నసరములును,
సాంద్రమయిగనుపట్టు చంద్రహారములు.
మిక్కిలిరాజిల్లు మిరియాలపేరులును,
దాసఖల్లియును సుందరపతకములును.
కంఠపువ్వులుచంద్రకాంతమణిహారములు,
పగడాలకుతికంటుబంగారుతీగెనీలంపుగాజులును.
మేలైనపోచీలుపాంచ మాలత నాంకంకణంబులను,
ముక్కుగుంజనాగొలుసులును ముద్దుటుంగరములును.
దండచడియంబులును దండతాయతులు,
నవరత్నములుచెక్కి పట్టికస్సు సపరా.
మొలనూలువడ్డాణముచు ఘంటికలును,
కాళ్ళనందెలుసిరికడియములు పాంజెవులు.

గొలుసులుపావడాలు పొలుపొంద పెట్టి,
కాళ్ళవ్రేళ్ళకును పిల్లెళ్ళుమెట్టె ౫౫.
చుట్టుబొబ్బిలికాయలును బొద్దియలు బెట్టి,
వాసికనుప్రాంతత్తు హంసంబులౌను.
సంధించి కత్తెరకు చందనముబూసి,
కర్పూరమాలికలుకంఠ మందిడునవైచి.
మేలిమిజాలాగు మేల్మున్నుకుంబోసి,
పచ్చలబొదాపిన పల్లకీలోపలను.
గొబ్బునదమయంతి గూర్చుండబెట్టి,
పసిడిబెత్తులుచేతబట్టి చెలికత్తెలు.

—(*) దమయంతి పార్వతీభవనంబునకువెళ్ళుట. (*)

యిరుగెలంకులనడచి విరిబోణినపుడు,
పార్వతీమందిర ప్రాంతంబునకువేగ.
వెంటబెట్టుకువేగ వెలదిసద్భక్తి,
అల్లంతటగౌరి యాలయముబోడగాంచి.
పల్లవాధరివేగ పల్లకిడిగ్గి.
మానసంబునగౌరి ధ్యానంబుసేయుచును.
కాలినడకనుబోయి కంజాయతాక్షి,
చెలులునుదాను కోవెలచుట్టుముమ్మారు.
పలగోనికరపల్లవములు జోడించి,
ఫాలభాగమునందు గీలించిపార్వతిని.
దమయంతియపుడు ప్రార్థన జేసెనిట్లు,
శరణుశంకరరాణిశరణు పల్లవపాణి.
శరణుబంభరవేణి శరణుపూబోణి,
శరణుజగన్మాతశరణు కరుణోపేత.

శరణుగిరిసంభూత శరణువిఖ్యాత,
    శరణుమదగజయానశరణు భక్తవిధాన.
శరణుజగత్త్రాణ శరణుసుజ్ఞాన,
    శరణుసుధాకరీ శరణుహరిసోదరీ,
శరణుతలోదరీ శరణుశ్రీగౌరీ,
    తల్లిరోనీపాదపల్లవంబులుమదిని.
నమ్మితినోయమ్మనన్ను గావవమ్మ,
    నాకాధిపులిపుడునను గేలిసేయంగ.
నలుగురుజనుదెంచి నారమ్మయిటకు,
    వారితలంపెల్ల వారించినలునినా.
పతిచేసిరక్షించు పార్వతీదేవి,
    అనిచాలప్రార్థించియాభీమువరపుత్రి.
పొందుగానాగౌరీ మందిరమువెడలి,
    తనుచుట్టుచెలులు సంకడిచేయుచుండంగ.
పల్లికినెక్కితా నుల్లాసముగను,
    తండ్రిసన్నిధికేగధారుణీశ్వరుడంత.
పరమసంతోషసంభరితాత్ముడగుచు,
    ధారుణినాయకుడుతనతనపుత్రిచేతికిని.
సకలంకమతినిచ్చె నొకపుష్పమాల
    మరిసుదేవుండనగ బరగువిప్రునిజూచి.
శ్రీమానసీకుండు ప్రేమనిట్లనియె.
    ధరణీసురోత్తమా దమయంతితోనేని.
సభలోనగూర్చున్న జనపాలవరుల,
    అన్వయముదేశ గోత్రాభిధేయంబులును.
వివరంబుగాజెప్పవే యనుచుబల్కి,

ననుగుంతిగనికత్క నల్లిరో నీవిపుడు.
క్షోణీశ్వరు లెల్ల జూచి వేడుకను,
మునమొప్పనీవెవరు మోహించియున్నావో.
యాతని కంఠంబు నందునీపుష్ప,
మాలిక దగవేయుమా తల్లిరో యంచు,
బల్కి భటులకు జెప్పి బహుభద్రమనుచు,
తనకుమారికనొక్క తావుననుండుమని.
పంపించి తా నుండె పదిలంబుగాను,
అంతనా దమయంతి కాంతా సమూహంబు.
తనచుట్టుగొల్వ సంతసమొప్పగాను,
సభలో ప్రవేశించు సమయమందునసురలు.
నల్వురు సజను దెంచి నలునిరూపములు,
ధరియించియానలుని దగ్గరనుగూర్చుండె.
నంతను దేవుండు సంతసంబొప్ప,
ఏబదియారు దేశస్థులను తానప్పుడు.
సుందరీమణికిట్లు జూపింపదొడగె,
కాంతరో యీతండు గౌళభూనాథుండు.

—(*) దమయంతి స్వయంవరస్థలమున కేగుట. (*)—

అంగనామణి యీతడంగభూవిభుడు,
మదిరాక్షి యీతండు మత్స్యదేశపురాజు.
నెలతయా శూరుండు నేపాళవిభుడు,
సుందరాంగి యితండు సూరసేనాధిపుడు.
వంగ దేశప్రభుడీ వనిత యీతండు,
వనితరో మహారాష్ట్ర పతి యీ మహారాజు.
గాంధారవిభుడితడు గంధేభయాన,

బోటియీఘనుడు కర్ణాట దేశపురాజు.
యవనభూపాలుండును విదయీతండు,
కుకుర దేశమునేలు కొమ్మరోయీరాజు.
చోళ దేశమునేలు సుదతియీప్రభువు,
విరిబోడియీతండు కురుధరాధీశుండు.
కోమలాంగియితండు ఘూర్జరవిభుండు,
పంకజముఖియతడు కొంకణాధీశుండు.
పద్మాక్షియీతండు పాంచాలవిభుడు.
బర్బర దేశాధిపతి యితండతివరో.
నాతికళింగాధి నాథుడీనృపతి,
కీరవాణియితండు కేరళాధిపుడమ్మ,
మందయానయితండు మాళవాధిపుడు,
అనియిట్లు భూనాథులందరినిజూపించి.
నలునిజూపగబోవ నలునిదగ్గరను,
అచ్చుబోడచినయట్లు అయిదుగురునలులుండ.
జూచిసుదేవుండు చోద్యంబునొంది,
ఏమిజెప్పగలేక భూమిానురుండంత.
మానంబుధరియింప మదిరాక్షిజూచి,
ఇదిదేవతులమాయ యిందుకేమందునని.
పల్లకిడిగ్గితప్పక దేవతులకు,
హస్తములుజోడించి ప్రస్తుతులుగావించి.
పల్కెనీరీతిగా భామాలలామ,
ఇదియేలనయ్య మిాకిట్టితుచ్ఛపుబనులు.
నాతండ్రులైయుండి ననుగేలిసేయ,
మిాకుధర్మంబగునె మిాపుత్రికనుగానె.

నన్నుగోరుటమీకు న్యాయంబుగాదు,
నాకాధిపతులార నలమహారాజునకు,
ననువివాహము జేసి కనులారజూచి,
వేడ్కతో మమ్ము దీవించిమీతావునకు.
వేంచేయరయ్యనా వెరపెల్లమాన్పి,
అనుచు బ్రార్థింపంగ ననిమిషులులజ్జించి.
ప్రత్యక్షమైనిల్చె బ్రజలెల్లజూడ,
నిజరూపములతోడ నిర్జరలునిలువంగ.
దమయంతియపుడు భూధవులుజూడంగ,
నలునిజేరగబోయి సలలితంబగుపుష్ప.
మాలికవయిచె భూపాలుకంఠమున,
సభయందు దేవదుంధుభులెల్ల ఘోషించె.
భువిమీదవర్షించె బుష్పవర్షంబు,
పాడిరిగంధర్వపతులెల్ల మోదమున.
నాడిరివేడ్క రంభాదికాదిమునులు,
అప్పుడు దేవేంద్రుడరుదెంచి ముదముతో,
నలరాజు నాలింగనముజేసిపల్కె,
పుడమిశనీవంటి పుణ్యవంతులనేను.
జూడగాలేదు యీమూడులోకముల,
నీమనోనిశ్చయము నీసత్యసంపదయు.
నీదేవతాభక్తి నీధైర్యకలిమి,
శోధింపగోరి వచ్చుటగానిమేమిటకు.
దమయంతికోరికగా దయ్యభూనాథ,
దమయంతిపెండ్లియయి ధాత్రీతలంబెల్ల.
చిరకాలమేలుమీ క్షితినాథచంద్ర,

అనిపల్కి దేవేంద్రు డగ్నిహోత్రుడుయముడు.
వరుణుండునలుని దీవనలుగావించి,
దివికేగిరంత భూవిభులెల్లనేతెంచి.
నలరాజునకు సంనములుగావించి,
నుతిసేయభీముభూపతి వేగమునుదెంచి.
నలమహీపతి మన్ననగౌగిలించి,
భూపాలచంద్రనే పూర్వజన్మమునందు.
నవనిలోనేపుణ్య మాచరించితినో,
రాజాధిరాజువయి రాజిల్లునీకునా.
కన్యకనిచ్చు భాగ్యముగల్గెనాకు.
అదిగాకమరియు నింద్రాదిదిక్పాలకుల,
దర్శనంబయ్యె నీదయజేతనేడు,
అనియనేక విధంబులనుపన్నతులుజేసి,
—* దమయంతి వివాహము. *—
కళ్యాణయత్నంబు గావింపుడనుచు,
మంత్రులతోజెప్ప మరివారలతివేగ.
భీమునినగరులో శ్రీమీరగాను,
సుందరంబగు గొప్పపందిలివేయించి.
క్రిందుభాగమునందు చాందినీగట్టి,
తళుకొప్పుచంద్ర కాంతపుశ్లేద్దులట్టలుణ.
చెలువైనపంచ వన్నెలగులోబులును,
వ్రేలాడగట్టించి వెలయంగవాటిలో.
పచ్చికప్రమిదెదీపములు వెలిగించి,
ఆమధ్యమధ్య ముత్యాలచేరులుకట్టి.
తీరైనపచ్చలా తోరణాలుగట్టి,

రత్నవేదికయందు రమణీయమైనట్టి.
కాంచనపీఠంబునుంచియాచుట్టు,
భవ్యమాశశికాంత పళ్ళెరంబులతోడ.
తాంబూలపుష్పాక్షతంబులమరించి,
ముదమొప్పగాను నేబదియాఱుదేశాధి.
పతులబంధుల పురోహితులరావించి,
అమరంగనుచితా సనములవారలనెల్ల.
నాసీనులుగజేసె నాభీమరాజు,
నలమహారాజునకు కులగురుండైనట్టి.
ఘనుడువసిష్ఠుండు చనుదెంచెనపుడు,
ఢంకానగారాలు ఢమఢమాయనిమ్రోయ.
రివ్వురివ్వునభజంత్రీలు మ్రోయంగ.
ఝుణఝుణమనుచు తాషామరఫలునుమ్రోయ.
మేళ్లైనరండోలు మేళములుమ్రోయ,
నఫీరీసానాయీలు నాగస్వరంబులును.
అల్గోజుమేళంబు లాదివాద్యములు,
భూనభోంతరమెల్ల భోరుకొబ్బుచునుండ.
బంచవన్నెలమతా బాలుచత్రములు,
చిచ్చుబుడ్లును తారజీవలునుబాణాలు.
ధన్నుధన్ననుయగాదా ఫిరంగులును,
వీణారవంబులును వేణునాదంబులును.
సానులమేళముల్ సంగీతములును,
చూచువారికిమహా చోద్యమైకనుపట్టె.
నట్టిసమయంబు నందావసిష్ఠుండు,
సరగునజనభీము జననాయకునితోడ.

పెండ్లిలగ్నము సమీపించినదటంచు,
విన్నపముసేయంగ వేగయాభీముండు,
దమయంతిచెలుల మోదమునబిలుపించి,
తక్షణంబునమీరు దమయంతికడకేగి,
మంగళస్నాన మాయంగనామణికి,
వేవేగగావించి వెలదిశృంగారించి,
వెంటబెట్టుకురండు వేగంబుబోండు,
అనగనాచెలికత్తెయలు సంతసంబుతో,
త్వరితంబుగానేగి దమయంతికపుడు,
తలయంటినీరార్చి తడియొత్తికురులెల్ల,
కొనగోళ్ళతోడ జిక్కులుదీర్చిమరియు,
శిఖవేసిబంగారు జీల్గుబుటేదారు.
తల్కొప్పకీన్కాబు తాబిదుంగట్టి,
ఘనమయిన తేట బంగరుపూలకంచురము.
బిగువుగుబ్బలమీద బింకముగదొడగి,
కనకంబుచుల్లె మొగ్గల జరీఖండువా.
పయ్యెద వేయించి బహుమణిసగత,
భవ్యమయినసమస్త దివ్యభూషణములా.
వారిజాక్షినలం కారంబుజేసి,
సిద్ధంబుగానుంచి చెలియలానలమహీ.
నాధునకభ్యంగ నంబుగావించి,
వినులమహాసట్లు పుట్టముగట్టగానిచ్చి,
యురుబంగరపుబుటా యుత్తరీయంబు.
పొసగపాలమునందు వసదుకస్తురినిడుద.
నామంబుదిద్ది క్రొన్ననలుశిఖజుట్టి,

దివ్యకిరీటంబు భవ్యకేయూరాధి.
భూషణంబులుదాల్చి పొలుపొందగాను,
మోదమొప్పగబెండ్లి వేదికోపరియందు.
గూర్చుండబెట్టిరా కువలయాధిపుని, . .
పట్టుపుట్టంబొకటి భామామణులుదెచ్చి.
తెరబట్టియుండగ గొందరుసతులుబోయి,
కడువేడ్కదమయంతి కన్యకామణినపుడు.
పీలుగాహోంబట్టి జాలారువాణీ,
మేల్మిసుంగునబోసి మెలతలత్యానంద.
మొప్పగాకై దండ యొసగదోడ్కొనుచు,
కళ్యాణవేదిపై గనకాసనమునందు.
తరుణులునుబట్టిన తెరకుచాటుగను.
గూర్చుండబెట్టి నాగుణవతిదమయంతి.
సిగ్గుచేగూర్చుండె శిరమువంచుకొని,
అపుడువసిష్ఠుండు నక్షతలుచేబూని.
మహితబర్వంతువార నుంగళమటంచు,
శ్రీలుకెనొ్నంద నాశీర్వాదమొనరించి.
వెలయంగనలమహీ విభునిచేనిపుడు,
గణనాయకునిపూజ గావింపగాజేసి.
రమ్యరమ్యతరంబైన రత్నకంకణము,
హస్తంబునకుగట్టె నంతనాభీముండు.
పద్మరాగస్థగిత పసిడిపళ్లెమున,
తనభార్యకలశ చేకొనిజలముబోయంగ.
నలమహీశతిపాద జలజములుగడిగి,
భక్తితోనపుడు నాపాదతీర్థముతాను.

భార్యాసమేతుడై పరమమోదమున,
శిరమందు పరియించి క్షితినాయకునికపుడు.
సాలంకృతముగ గన్యాదానమిచ్చె,
అప్పుడునలునిచే నావసిష్ఠుండు.
దివ్యమంగళసూత్ర మాయంగనామణికి,
కట్టించిమరియథా క్రమమొప్పహోమాది.
తంత్రములునడిపించె దదనంతరమున,
ప్రియమొప్పగానంత భీముడాయల్లునకు.
లక్ష మొహారీలు వరదక్షిణయొసంగె,
భూసురోత్తములకును భూరిసంభావనలు.
కోట్లకొలదిగనిచ్చె గువలయాధిపుడు,
పరగంగనావెనుక పంచభక్ష్యములతో.
భోజనంబులతృప్తి బొందిరందరును,
సకల దేశాధీశ సముదాయమునకెల్ల.
గౌరవంబొప్పంగ కట్నంబులిచ్చి,
విద్వాంసులకు సత్కవీంద్రులకు.
వైణికాప్రకరంబునకు ఘనాపాఠకులకెల్ల,
మురుగులుజోడాలు నరుశహాల్జోడాలు.
విలువైనమకర కుండిలములాదిగను,
బహుమానములుసేయ బరమసంతోషమున.
నాజ్ఞగైకొని వారలరిగరంతటను,
ఇట్లుండ దమయంతి కిలస్వయంవరమంచు.
దేవేంద్రునితోసంభాషించి నలునికడకేగుట.
జనభయంకరుడయిన శనియాలకించి,
వేవేగమరుదెంచి దేవేంద్రుబొడగాంచి.

వినయంబుతోడనా శనిబల్కెనట్లు,
సురదనాథవినుముయీ ధరణీతలమునందు,
భాసురంబుగ విదర్భాపురంబేలు,
భీమావనీశునకు పెంపొందనుదహరించె.
దమయంతియనునొక్క తరళాయతాక్షి,
వానిసర్వాంగ సౌందర్యంబువర్ణింప.
శారదాపతికయిన శక్యంబుగాదు.
వనితకిప్పుడుస్వయం వరముచాటించిరని.
వీనులవిందుగా వింటినీప్రొద్దు,
నేనిప్పుడేగియా నీలవేణివరించి.
తెచ్చెదసెలవిమ్ము దేవేంద్రయనగ,
పక్కననవ్వియా పాకశాసనుడపుడు,
సభవారువినగనా శనితోడబల్కె,
ఏలబోయెదవోయి భూలోకమునకిపుడు.
వినుపింతునీకునా వృత్తాంతమంత,
ముందుగానేమేము మునమెప్పనీవార్త.
వినియగ్నియమవరుణులను వెంటగొనుచు,
భూలోకమునకేగి పుష్పబోడికిమేము.
క్రమమెప్ప రాయభారముబంపగాను,
దవళాక్షిమమ్మెల్ల చంద్రులుగానెంచి.
నలునివరించెనా నవమోహనాంగి,
వెలయనాదమయంతి నలరాజునకునిచ్చి.
పెండ్లిగావించెనా భీమభూపతియు,
ఆమహోత్సవమెల్ల నాలోకనముజేసి.
యరుదెంచినాము నీవటకుబోవంగా

అనియింద్రుడు హెచ్చరింప నతికోపము వహియించి.
కనులెఱ్ఱఁగా జేసి కలిపురుషుడపుడు,
భగ్గునను౦డిపడి బిగ్గరశకలించి,
దిగ్గున లేచియా దేవేంద్రుఁజూచి,
బహుదినంబులనుండి పద్మాక్షిదమయంతి.
నే బెండ్లియాడంగ నిశ్చయించుకొని,
వనిత కెప్పుడుస్వయం వరమౌనకోయంచు.
దినము లెంచుకనేను తిరుగుచుండంగ,
నన్నుగాదని తాను నలుఁడడ్డముగవచ్చి.
యింతివరియింప దానెంతనాహసుఁడో,
దమయంతియయి నన్ను దలచకుండగ నలుని.
కోరియెట్లువరించె కొంకులేకుండ,
యింతకుముందుమీరీ వర్తమానంబు.
నాకుజెప్పకయుండ న్యాయమా దేవ,
పోయిమీరైననా పొలతివరించకను,
నరులువవ్వగరిత్తె తిరిగివచ్చితిరి,
అమరులువచ్చినారని తామునుఁబోవకను.
చెలియనువరియింప నలుడెంతవాడు,
కానియ్యనేవాని కాంతతోడనుబట్టి.
పూనిజూదంబాడ బుద్ధిపుట్టించి,
మాయలుజేసియీ మహిరాజ్యమోడించి.
కారుటడవులపాలుగా జేసిమరియు,
పైమీదనున్నట్టి బట్టఁబోవగజేసి.
వికృతరూపునిజేసి వెలదినెడబాపి,
ధీరత్వమెడలించి దిగులుఁబుట్టగజేసి.

మానంబుదూలించి మతిబోవజేసి,
    కుండగోకిరిజేసి మండలాధీశునకు.
వండిపెట్టగజేసి వానినీరీతి,
    చీకాకుపడునట్లు సేయకపోతినా.
నాపేరుశనిగాదు నాకేశవినుము.
    అనగనాశనిపల్కు లాలించి దేవతలు.
దిగులొందిరపుడు దిరదిరఘూమిదిరిగె,
    శతమన్యుడప్పుడా శనితోడనిట్లనియె.
నింతకోపంబు నీకేలరవిపుత్ర,
    నలరాజుబట్టంగ నలవినీకెట్లవును.
నీకుసాధ్యుడుగాడు నీకసాధ్యుండు,
    కర్మకుండత్యంత నిర్మలాచారుండు.
ధర్మప్రవర్తనుడు ధైర్యవంతుండు;
    సత్యవ్రతుండు నిశ్చలదైవభక్తుండు.
వేదశాస్త్రవినోది వేదాంతవేది,
    వానివర్ణింపంగ వశముగాదెవ్వరికి.
నరుడుగాడతడాది నారాయణుండు.
    అటువంటివానిపై నలుగుటకొరగాదు.
కావుననీదహంకారంబువిడచి,
    శాంతించుమనుచు నాజంభారిపలుకంగ.
శక్రునిజూచియా శకునిబలికెనిట్లు,
    బలభేదినీవిట్లు బలుకంగతగునయ్య.
నామాయబడకుండ నలమహారాజు,
    ఎంతటిఘనుడునే పంతగించితినేని,
హరిహరబ్రహ్మాదు లష్టదిక్పతులు,

భయమొందు మందుకీ పాధీనవుండన నెంత.
పగదీర్చుకొందు తప్పక జూడుమనుచు,
నిలచినచోటతా నిలువలేక విదర్భ.
పురిజేరెనాశనై శ్చరుడు వేవేగ,
నలరాజుకడకినా కలిపురుషుడే తెంచి.
యాతనిపత్యంబు లతనిసత్కర్మ,
ఆతనిశాంతశౌ చాదులుబరీక్షించి.
ఘోరాజునిపుడెంట గారాదటంచు,
నిష ధేశువెనువెంట నీడరీతిగనతడు.
కని పెట్టితిరుగుచుండెను శనైశ్చరుడు,
అంతటనలుడు భీమావనీశ్వరుగాంచి.
యిక నాపురంబుకు కేగంగవలయు,
సొంపుగామీపుత్రి నంపించుమనిపల్క.
సంతసంబునభీము జననాయకుండు,
తనభార్యకీవార్త వినుపింపగానపుడు.
ఖీముడునమయంతిని నత్తవారింటికనుపుట. *-
సుదిర్ఘమానపరగ నామనుజేశు దేవి,
కన్ను నమ్ముల భాష్ప కణములుట్టిపడంగ.
దమయంతిబిలిపించి తాగౌగిలించి,
తల్లిరో ఘనవేనీ తండ్రిగారిప్పుడే.
వారకనిన్ను వారింటికనుప,
తలచినట్టుగ జెప్ప నల్లిని న్నెడబాసి.
నేనెట్లుభరియింతు నేకన్నతల్లి,
బొమ్మలపెండ్లిండ్లు బొట్టెలనుగూర్చుకొని.
యెపుడుజేసేనెమా యింటనికమీద,

మోష్టిగపద్మంబు మొదలైననోము.
లింకెవరునోచేరె మాయింటనికమీద,
సగుటాలపాళీలు చదరంగమాదిగా,
నెవ్వరాడేరేమాయింట నికమీద,
కూతురానీవులేకున్న నాయిల్లెల్ల.
చిన్నబోవు నికనేమిసేతువోయమ్మ,
అనియనేకవిధంబు లాతల్లివగువంగ.
దమయంతియేడ్చె నంతటదాదులెల్ల,
నధికంబుగానేడ్వ నాభీముడేతెంచి.
తనభార్యనూరార్చి దాదులనుగదిమి.
దమయంతిముద్దాడి తల్లిరోనీవిట్లు.
చింతింపవచ్చునా చిన్నినాయమ్మ,
ఘనమైదపట్టభద్రుని చెట్టబట్టితివి,
రాకేందుముఖియింక నీకేమికొదువె,
నినుబాసినాకొక్క నిమిషంబుతోచునా.
ప్రియమార వెంటనే పిలువనంపింతు,
పద్మాక్షిరోనీవు పతిసేవమానకను.
కన్నవారింటికిని వన్నెదేవమ్మ,
పరిచారకులవలన పతులుగైకొనునట్లు.
గఠినంబుగాబల్క గారాదుసుమ్మ,
పొలతిరోసుఖముగా బోయిరమ్మనిపల్క
దండ్రిపాదంబులకు దండంబుబెట్టి,
దీవనలుకొనుచుదా దిగిరితల్లినిజేరి.
మ్రొక్కినదీవించి ముదమొప్పగాను,
ముదితచెక్కులునొక్కి ముద్దులాడియనేక.

బుద్ధులుజెప్పిపెంపుగ గౌరవించి,
  పోయిరమ్మని బల్కెబూబోడితనయున్.
పాదంబులకు మ్రొక్కి పైనంబుగాగ,
  దమయంతికిప్పుడా తండ్రియగుభీముండు.
యేదువారపునగలు హేమాంబరములు,
  దంతపుకుర్చీలు దొంతరడబ్బీలు.
మణిమయమయినట్టి రత్నపళ్ళెములు,
  కీలుబొమ్మలుహంస తూలికాతల్పములు.
అత్తరుగండీలు పరివాణములును,
  నిలువుటద్దంబులును వెలలేనితప్పిలుల్
పన్నీటికుప్పెలును పసిడిపాందాను,
  మేలైనకీలుపల్లకీలుతివాసీలు.
భోజనపాత్రములుపునుగుజవ్వాది,
  పాడిమొదవలుచిల్కపంజరంబులుదాసీ
దాసీజనంబులును ధనపేటికలును,
  మొదలుగాగలయరణములనిచ్చియల్లున
నుత్తమాశ్వంబులనుమత్తగజములను,
  మణిరథంబులు విభూషణచయంబులనిచ్చి,
వీడుకొల్పగనంత వేడుకలుమీర,
  మామగారికిమ్రొక్కి మహిమతోనలుడంత
దనమంత్రితోనసంతసమొప్పగాను,
  రథముపై కూర్చుండెరత్నపల్లకిలోన.
కూర్చుండెదమయంతి కుతుకంబెసంగ,
  పసముప్పదిరెండు వాద్యములుమ్రోయ
నాగవాసముయెదుట నాట్యములుసేయ,

వేడివస్తువులపయి వేడుకరంబల్లె,
పొలతికినవమాసములు పూర్ణమయ్యె.
ఒకశుభదినమందు నుచ్చరాసులయందు,
గ్రహములన్నియునిల్వ కాంతగర్భమున.
పూర్ణచంద్రునిబోలు పుత్రుండుజన్మించె,
మందమయివీతెంచె మలయమారుతము.
అప్పుడాభూపాలు డత్యంతసంతోష,
మొప్పంగజేసె బుత్రోత్సవంబలర.
గురువులరప్పించి కూర్మిపుత్రునకప్పుడు,
కడుముదంబున జాతకర్మాదులెల్ల.
నింపారగావించి యింద్రసేనుండనుచు,
నామకరణముజేసె నలమహారాజు.
ఈలీలమరికొంత కాలమరిగినవెనుక,
మరలగర్భముదాల్చె మగువదమయంతి.
ముదితకునవమాసములు పూర్ణమయినంత,
గ్రహములన్నియు నుచ్చరాసులందుండ.
సానబట్టినమణిని శరియోయనంగను,
కువలయాక్షికికొక్క కూతురుదయించె.
అంతనానలనుహీ కాంతుండుసంతోష,
కలితుండగుచు జాతకర్మాదులెల్ల.
నేయించిమరి యింద్రసేయనియాసుతకు,
పేరుపెట్టించె నాధారుణీశ్వరుడు.
ధర్మమించుకతాను దప్పకుండనలుండు,
క్షోణీతలంబేలు చుండంగనంత.
అదియెల్లజూచితా మదినసహింపగలేక,

తనలోనశనియిట్లు తలపోయదొణగె.
ఈనలమహారాజు నేనుబట్టెదనంచు,
బాకశాసనునెదుట బంతంబుబల్కి.
ౘకునేనచ్చి మూడేండ్లయ్యెనేగాని,
వసుధేశుబట్ట నావశముగాదయ్యె.
ఊరకేపనిలేక నుర్వీశువెనువెంట,
దెలివిమాలినరీతి దిరుగంగవలసె
పీనిసాధింపకను నేనుబోయితినేని,
ననుజూచిసురలెల్ల నవ్వకుండుదురె.
ఇంతగాలముగాచి యికనునేనుబోజాల,
నితడనాచారంబు నెన్నడొనరించు.
అనిచింతతోడ నాశనిమహాదీక్షగను,
నరనాథువెనువెంట దిరుగుచుండంగ.
నలమహీపతియొక్క నాటిసమయమునందు,
పైకేగివచ్చితా బాదముల్కడుగ.
మడమనొక్కించుక మాత్రంబునీటిచే,
తడియకపొడియుండె ధరణీశ్వరునకు.
అదిగాంచిశనిమహా ముదితమానసుడగుచు,
నసకోర్కె నెరవేరె ననిసంతసించి.
కాలుదడియకయున్న కారణంబేయు,
నాచారమనిభావించి శనిబట్టెనలుని.
అదిమొదలొక్కనినలుని యాచారములనెల్ల,
జరగకుండగ శనైశ్చరుడుగావించె,
ఈకౌతుకంబెల్ల నెరుగకానలరాజు,
జనులెల్లబొగడ రాజ్యముసేయుచుండె.

శనిమహాసంతోషమునఁ పుష్కరుండనగ,
యానలరాజు దాయాదియొద్దకును.
శీఘ్రంబుగ జనుదెంచి క్షితివినాయకునిగాంచి.
శని యిట్లుబల్కె నాజననాథుతోడ.
వినుము పుష్కరనన్ను శనియందురీభువిని,
గ్రహములన్నిటికన్న ఘనబలుడ నేను.
నేడొక్క కార్యంబు నీకు జెప్పదలంచి,
వచ్చినయ్యయో వసుమతినాథ.
ఇలవిదర్భాపురం బేలుచు నున్నట్టి,
భీమవిక్రముడైన భీమభూపతికి.
భువనమోహినియయిన పుత్రికామణిబుట్టె,
సుమబాణుసతిబోలి దమయంతియనగ.
ఆబాలికను వివాహంబాడగా నేను,
నిశ్చయించుకనుండ నాశ్చర్యముగను.
నాకుదెలియకయుండ నలరాజుతానేగి,
భీతిలేకనుదాని బెండ్లాడివచ్చె.
గావుననలరాజు గర్వంబడతుజూడు,
నేనుజెప్పినరీతి నీవుగావింపు.
అదియెట్టులంటివా యాలించిజెప్పెదను,
నలరాజుకడకు తిన్నగాబోయి నీవు.
కుశలప్రసంగంబు కొంతసేపానరించి,
వేడుకతో జూదమాడుదమటంచు.
నీవుజెప్పుము మరియు నేనాసియాత్మలో,
జొచ్చినీతోగూడి జూదమాడంగ.
బుద్ధిఘటించెదను భూమీశ వేగంబు,

పొమ్మునీవారీతి పోకుంటివేని.
నీరాజ్యమంతయును నిమిషంబులోనేను,
భ్రష్టుగాజేతు నాప్రజ్ఞబరికించు.
ఆశనిపల్కు వాక్యముల కాపుష్కరుడు,
కాళ్ళుగడగడవడకి కడుభీతినొందె.
శనిదిక్కుజూచి తావినయంబుతో బల్కె,
నీమాటజవదాట నేనెంతవాడ.
నాయంతరంబేమి నలునియంతరమేమి,
వానికిబంటునై వర్తింపుచుందు.
అతనినాతో జూద మాడుమనిగోరుటకు,
నాకుతరంబౌనె నలినాప్తపుత్ర.
అనగబుష్కరుజూచి శనిధీరుడై బల్కె,
జననాథనీవింక సంశయింపకుము.
ఊరకేనీవేగి యుర్వీశ్వరునిజూచి,
జూదమాడుదమంచు సూటిగాజెప్పు.
ఆమీద నేవాని యాత్మలోపలనుండి,
నీవుగోరినరీతి నీతోడనతడు.
జూదమాడగజేసి క్షోణితలంబెల్ల,
నొక్కనిమిషంబులో నోడించిమరియు.
నిఖిలరాజ్యంబెల్ల నీచేతనేలింతు,
సందేహపడకు లేశంబునీమదిని,
వేవేగబొమ్మన్న విధిలేకపుష్కరుడు,
రథమెక్కినిషధా పురంబునకుబోయి.
నలరాజుసన్నిధానమునకేగి పుష్కరుడు,
భువిసాగిమ్రొక్కంగ భూపాలకుండు.

—పుష్కరుడుశనిప్రేరితుండై నలునితోజూదమాడుట.

మందహాసముఖార విందుడై పుష్కరుని,
యాలింగనముజేసి నామహారాజు.
జగతీశుడాగతునకు తగినకుర్చీమీద,
గూర్చుండగాజెట్టి కుశలమేయనుచు.
బలుకంగ బుష్కరుడు నలునిహితిగాంచి,
చేతులజోడించి యాతడిట్లనియె
మేదినీనాయకా మీకటాక్షము చేత,
శ్రీకరంబొప్పంగ మాకుకుశలంబు,
అనగనలుండు నయ్యవనీశుబొడగాంచి.
జననాథనీవిటకు పనిలేక రావు,
వచ్చినకార్యంబు ముచ్చటింపగవచ్చు.
ననగనాపుష్కరుం డానందమొంది,
క్షోణీశనితోడ జూదమాడగనాకు.
నభిలాషబుట్టెనే నరుదెంచినాడ,
నాకోర్కెనెరవేర్చి ననుగౌరవింపంగ.
చాధికావోత్తమునిన్ను బాధికాంతునవనిన,
నలరాజుచిరునవ్వునవ్వి పుష్కరుజూచి.
ధరణీశమనకు జూదంబాడదగదు,
వేటయునుజూదంబు వేశ్యభామలపొందు.
మాటప్రల్లదంబు మద్యపానంబు,
హద్దుమీరినదాన మతికఠినదండనము.
నియ్యేడుంవ్యసనంబు లెవ్వారికైన,
నాశనంబేగాని లేశమాత్రంబైన
క్షేమంబుగాదనుచు జెప్పుచుండంగ,

కలిపురుషుడంతలో నలునిహృదయముజొచ్చి.
బుద్ధిమళ్ళించంగ భూపాలుడపుడు,
ఎంతముచ్చటతోడ నేతెంచితివోనీవు,
పుష్కరానినుచిన్న బుచ్చంగతగదు,
సరగుననిప్పుడే సంతోషమొప్పంగ.
నవనీశయొకయాట యాడుదామనుచు,
మేలిమిపసిడినిర్మించిన యొకపగడ.
సాలదెప్పించి యచ్చటజక్కపరచి,
తీరమొప్పగా నాలుగుదిక్కులందునరత్న.
సారెలువేగంబు జక్కగానిల్పి,
యొనరంగపందెమే నలుండడుగంగ.
భూమీశుతోడ నాపుష్కరుండనియె,
భూనాయకోత్తమా నేనోటుబడితేను.
పనిబూనినేను నీబంటునయ్యెదను,
నేరుపెరుంగకను నీవోటుపడితేను.
నీరాజ్యమంతయును నెమ్మినాకిమ్ము,
అనగనామాటలకు జననాయకుడుమెచ్చి.
వెనుకొన్న వేడ్కతో వెలయపుష్కరుని,
తోడజూదంబాడ దొడరియానలరాజు.
తడయకమేటి దంతపుపాచికలును,
అమరించియొకబార యనుచుదొలిఁపుచును.
జననాథులిద్దరును సమముగానాడ,
పాపగ్రహమువాని పాచికలలోనుండి.
పలుమారుపందెంబు బడకుండజేసి,
అదిజూచినలరాజు యాశ్చర్యమునుబొంది.

తమకంబుతోనాడె గ్రమమెుప్పగాను.
మత్తగజములనోడె మణిరథంబులనోడె.
ఘోటకంబులనోడె గోగణమునోడె,
ధాన్యరాసులనోడె ధనపేటికలనోడె.
నవరత్నములనోడె గవచములనోడె,
ఉంగరములనోడె మరుకంకణములోడె.
చామరంబులనోడె ఛత్రంబులోడె,
పట్టుపరుపులనోడె బట్టుమంచములోడె.
గొప్పమేడలనోడె నుప్పరిగెలోడె,
కనకాంబరములోడె ఘనభూషణములోడె.
రజితపాత్రములోడె భుజకీర్తులోడె,
మేలైనగొప్ప ముత్యాలహారములోడె.
సంగీతముల బాల్లకీలోడె,
రత్నకిరీటాది రాజచిహ్నములోడె.
బరిచారకులనోడె భటసర్గమోడె,
అదిచూచితనమంత్రి మదితల్లడంబంది.
వినయంబుతోడ భూవిభుగాంచిపల్కె,
భూమీశవినవయ్య భూలోకమునదొల్లి.
యనఘునకిట్టి దువ్యసనంబుగలదె,
ఇదియేమిపనియంచు నిపుడుదోచెనుమీకు.
నెన్నడయినను మీరలిట్లాడినారె,
ఈజూదమాడంగ నేమిఘటిదుతోచె.
రాజేంద్రదమయంతి రయముగామిమ్ము.
జయసేయుమనిజెప్పి దాసీలనంపించె.
నిదివేళగాదుమీరీ జూదమాడ,

నలచరిత్ర - పదము.

ధరణీశయీశని వస్పులెల్లనుమరచి.
తడయకనాడంగ ధర్మంబుగాను,
లేలెమ్మునయాటచాలింపు మాతరువాత.
వాడవచ్చునటంచు నామంత్రివరుడు,
భూవరునిచెయిబట్టి లేవనెత్తగబోన.
గన్ను లెఱ్ఱగజేసి గర్జించిపల్కె,
నిన్నెవ్వరిటువంటి నీతులుజెప్పుమని.
పంపించి నాకునిర్భయముగానీవు,
చయ్యనవచ్చి నాచెయ్యిబట్టగనేల.
విడువిడుమనిచెయ్యి విడిపించుకొనుచు,
మానకశనిమాయచే నాడదొడగె.
నప్పుడుచింతించి యామంత్రివరుడు,
తప్పకనల ... బాడుసంగతిని.
చేరినద్దని తాను జెప్ప ... ధంబు,
కెరలియాతడు కోపగించినరీతియును.
ధారుణీచక్రంబు దక్కనంతయును,
ఉరువడితోనలుండోడి పోయినవిధము.
దమయంతితో నఘుతగజెప్పిబంపె,
మంత్రిబంపినవార్త నుదిరాడదమయంతి.
వినిగుండెఝల్లు ... వెరగందియపుడు,
ఇదియేమిపనివచ్చెనిక నేమిసేతునని.
దిగులొందియిట్లనుచు నుగువతలపోసి,
వారకతనమంత్రి వాక్యమయిననువినక.
నాడుచునలడెనట యాశ్చర్యముగను,
ఇదిదైవమాయ నేనేమిసేయుదునింక.

నిదిమొదలొక్కని మాకు నెట్టికష్టములు,
పొసగనేగతిమమ్ము బొందింపనున్నవో.
నుదుట నేమనివ్రాసెనో బ్రహ్మమాకు,
తనపూర్వకర్మంబు దాటనెవ్వరితరము.
నిటువంటిజూదంబు లెవరైనతొల్లి,
ఆడిరేసర్వంబు నోడిరేయీరీతి.
యనిచాలచింతించి యారాజవదన,
అప్పుడువార్ష్ణేయుడన నొప్పుసారథిని.
తటుకునబిలిపించి దమయంతిబల్కె,
ముందునూకేదుఃఖములు సంభవించునో
యీబిడ్డలిద్దరిని యిపుడుగొనిపోయి,
తడయకమాతల్లిదండ్రులకడ జేర్చు.
యిక్కడవృత్తాంత మెల్లవారలకు,
నెరిగించుమని జెప్పి యిరువురిబిడ్డలను.
శుకవాణివార్ష్ణేయునకు నొప్పగించె.
రమ్యతరంబయిన రథముపై నప్పుడా.
యిరువురుబిడ్డలను యెక్కించుకొనుచు,
పైనమైయప్పుడా వార్ష్ణేయుడత్యంత.
రయమొప్పగా విదర్భాపురముజేరె,
అక్కడానలరాజు వెక్కసంబుగనపుడు.
వెలయంగనేడు దీవులనొడ్డుబెట్టి,
వెనుకొన్నకలిమాయ నెతచేతనవియోడె
నాల్గుదిక్కులనోడె నలమహారాజు.
కట్టుబట్టలతోడ కరనుధీనిలువంగ.
నరనాథుజూచి పుష్కరరాజుబల్కె.

ఓ రాజవర్య నీవీరాజ్యమునవుండ.
బోసగ దెందులకైన బొమ్ము వేగంబు,
అనిచెప్పిపుష్కరుడుం డావార్తఁదమయంతి.
కెరిగింపుమని మహాగర్వంబుతోడ,
వనితలబంపంగ జనివారలావార్తఁ.
దమయంతితోడ న త్తరి జెప్పిరపుడు,
వినియాచకోరాక్షి వెరగంది దేహంబు.
గడగడ వణికెడు దుఃఖమొంది,
అంతఃపురము వెడలి యతివలును పురజనులు.
జూచుచునుండంగ సుదతీలలామ,
సభకేగుదెంచి తా విభునన్నిధినిల్చి.
యిదియేమి ప్రాణేశ యాచోద్యమనిన,
మనుజేశుడపుడు యేమన లేక తనశిరము.
వొంచుకొని మిగుల చింతించి తానపుడు,
ధైర్యంబు దెచ్చుకొని భార్యతోనిట్లనియె
ఇందీవరాక్షిరో యిది పురాకృతము,
కర్మమే మేలౌన కర్మమే కీడౌను.
కర్మమే సుఖదుఃఖ కారణంబగును,
వెలదికర్మంబనుభవించగవలెగాని.
పొమ్మన్నపోవు నాపూర్వకర్మంబు,
బ్రహ్మదేవునికైన పద్మనాభునికైన
దేవదేవునికయిన దేవతలకయిన,
అనుభవించకతీరదని చెప్పుశాస్త్రములు.
మనమునగా నెంత సుదిరామతాక్షి,
అనియిట్లుబోధించి నాథుడాదమయంతి.

గనుగొనిపల్కెని క్రమముగానలుఁడు,
　　మనముకాసలకు సమ్మదమొప్పబోవలయు
మానసంబునజింత మానిరమ్మనగ,
　　వినియాసతిప్రీతియు విభునివాక్యంబులకు.
జనదాటకిప్పుడె సమ్మరంబొప్ప,
　　భర్తవెనువెంట నాపద్మాక్షి నడువంగ,
భూనాయకుఁడు వెడలి పోవుచుండంగ,
　　ఆపురంబుననుండు బాలవృద్ధాదులును.
గుంపుగుంపులుగట్టి ఘోరముగ నేడ్వ,
　　నలుడువారలదిక్కు తలయెత్తిచూడకను.

—* నలుడు దమయంతితో గానసంబున కరుగుట.

వీథులన్నియును పొందుగాదాటి,
　　చెయ్యూతగానిచ్చి చెలి నడిపించుకొని.
యొకపర్వతముజేరు మహీశ్వరుండు,
　　మరియంతసూర్యాస్తమానంబుగాగానె.
పర్వతగుహాయందు భార్యయునుతాను,
　　వసియించిశుష్కాసవాసులై సొమ్మసిలి
రాళ్ళపై బవళించి రావధూవరులు,
　　అరికాళ్ళుమంటచే నాకలిబాధచే
నిమిషమాత్రంబైన నిద్రపట్టకను,
　　పరితపించుచునంత భానోదయంబైన.
నుభయులుగాంచి యకయకృత్యములు,
　　తరువాతనాకొండదాటి యవ్వలకే
గడుకురాళ్ళు మహోపల ఘనమైనయంత్ర
　　కారెనుపలుపులు గంటెభేటంచముగ.

ఝిల్లీమృగంబులును భల్లూకములును,
గండాన్మృగంబులను కంఠీరవంబులును.
కొండముచ్చులుమరియు కోతిమూకలును,
గలిగియుండినగొప్ప కారడవిలోదూరి.
ఖోవుచునుండంగ బొదలలోనుండి,
మృగములుధ్వనిసేయ బెగడొందిదమయంతి.
కాంతునిచెయ్యాత్రగా బట్టుకొనుచు,
మెల్లగానడునున నాపిల్లజాంఘరికాళ్ళ.
ముండ్లునాటినచాలకండ్లనింతొలుక,
వంగియాముండ్లుదీయంగ గోరెంటముల్.
వనితకొప్పునదగులుకొన గహ స్తముల,
తప్పించుకొనుచుండ వరుణిచేతులయందు.
నూదులువలెముండ్లు దట్టమునినాడి,
చిల్లునునెత్తురుల్ జిమ్మంగతనపైట.
కొంగుకంపలదగిలి కొతకాలుబడంగ,
యెండవేడిమికినోరండి దేహముగంది.
అరికాళ్ళుపొక్కి ముంగురులెల్లజెదరి,
నేలపైనిసుమంతకాలు మోపగలేక.
శోకింపచుండ నాసుందరినిజూచి,
మానుబట్టగలేక మునజేశ్వరుండపుడు.
వెక్కివెక్కేడ్చుచును విధినిదిట్టుచును,
కట్టిలసంతలినికౌగిట బెట్టిమెల్లగా.
నడిపించుకొనిపోయి నలమహారాజు,
ఆకలిచేగాయలాకు లనుభక్షింప.
చేదయ్యెగవియెల్ల వాదేవమాయె,

నిలువంగ నెచ్చోట నీడగనుపడకుండె.
నేళ్ళను గడ్డలును యింకుడై పోయె,
మతిమాలి ధృతిదూలి క్షితి వ్రాలి కడుసోలి
కండ్లన చీకట్లు గప్పుచుండంగ,
అట్టిసమయమునందు వసనీశ్వరుని యెదుట.
బొలుపొంద రెండుపక్షులు వ్రాలజూచి,
మానవేశ్వరుడంత మదినిసంతోషించి.
భాగ్యమును జూచి తా బల్కె నానలుడు,
మిగువరోమనయందు భగవంతుడీవేళ.
నిండునయతో బంపె రెండుపక్షులను,
ఈపక్షులనుబట్టి యిపుడు మనమిద్దరము.
భక్షించుదామనుచు బల్కి తానపుడు,
పొలిచి బక్షులబట్ట బోవంగ నవి బెదరి.
దవ్వుల కేగంగ ధరణీశ్వరుండు,
ఇందుముఖి నొక చెట్టు క్రిందగూర్చుండుమని.
జెప్పి భూపాలుండు శీఘ్రంబుగాను,
పరుగుపరుగున బోయి పక్షులకు నడ్డమై.
పట్టబోవగ నవియు మిట్టిబడి యెగసి,
మరికొంతదవ్వేగి మానవాధీశ్వరుడు.
విసికి మళ్ళంగ నావిహ్నముల్ రెండు,
కాళ్ళకగ్ర వ్రాలగా జూచి నలరాజు.
పై నీవనున్నట్టి పచ్చడంబపుడు,
పక్షులపై వైన బట్టబట్టుక నవియు.
గగనభాగంబునకు నెగసియచ్చోట,
కలచిపక్షులు రెండు నలరాజుతో బల్కె.

మేముశనిదూతలము మేదినీనాథ,
అతనిగాదనినీవు నలనామమెంచియంతి.
పొందుగానునిపరించినందు కాతండు,
చలముచేవినుబట్టి సాధింపుచున్నాడు.
యింతటఁబోదు మీరికష్టమ్ములు,
నీబట్టదెస్సనుచు నేనునున్నంపింగ.
పచ్చినందుకుబట్ట నిచ్చితివిమాకు,
పోయివచ్చెదమంచు మాయమైపోవంగ.
నిషధభూపాలుండు నిర్ఘాతుడగుచు,
ఘనమైనశోకసాగరమించే యనుగుచును.
తన దేవికడకేగి తగసిగ్గుతోడ,
వనితలుజూచియావసుధేశుడిట్లనియె
పక్షులునాతోడి బల్కినవిధంబు,
నీవువిన్నవరించి నావచుచుకోపమును.
జలమునశనినుచల సాధింపవలచి,
సుదతిరోసనుబట్టి జూదమాడగ జేసి.
ప్రాపమియునోడించి యడవిపాలుజేసి,
తుదనుకట్టినకట్ట దోచుకొనిరమ్మనుచు.
మాయపక్షులు నేడుమనగొడ్డికిట్లు,
పంపగవవినన్ను భ్రమపెట్టిపైగట్ట
పక్షులెత్తుకపోయె బద్మాయతాక్షి,
గల్లజూదంబాయె కటకటాయిదియేమి.
మాయయాయికనేమి చేయంగవచ్చు,
ఈయరణ్యములోన నిద్దరమికమీద.
నలివేణియేదుఃఖమును భవించెదమొ,

ఇట్లుబాధింపంగ నేమి జేసితిశనికి.
దైవమాయని చాలతల్లడించంగ,
దమయంతియపుడు భూతలనాథుచెయిబట్టి.
ధైర్యంబుతో బల్కె దరళాయతాక్షి,
ఏలగాసోలపోతయిన కులాధీశ్వరా.
పోలించిచూడు మాభూతలంబందు,
కర్మవశంబుచే గలుగుయాపదలెల్ల.
పాలలోచనుడయిన బాపుకోగలడే,
నాగరంబులపొంగి జగమెల్లపొంగితే.
కట్టనుపాయంబుగలదె యెవ్వరికి,
ఈతకుమించిన లోతుగలుగునానాథ.
విషమెక్కనేతల వెంట్రుకలుదాటి,
మిన్నువేగమెవచ్చి మీదబడుచుండంగ.
నేర్పుచేచెయ్యాని నిలుపశక్యంబె,
ఎంతేసికష్టంబు లేగుదెంచినగాక.
సంతపడిధైర్యంబుప వలంగదగదు,
దైవంబుమనమీద దయలేకసీరీతి,
జేసినమనమేమి జేతుమోనాథ,
ఇంతకుమిక్కిలి యేమివచ్చినగాని.
యంతయుపురాకృతం బనియూరకోమ్ము,
తలచకుమురాజ్యంబు తలచకుముభోగంబు.
తలచకుముబిడ్డలను తలచకుముపురము,
వదలకుముధైర్యంబు వదలకుముసత్యంబు.
వదలకుముహరిచింత వదలకుముబుద్ధి,
పుట్టుభోగములెల్ల బోయినతరువాత.

బట్టకై దుఃఖింప పనిలేదునాథ,
అనుచుబోధించి నెయ్యంబుతోదన.
కొంగునాథునిపై గప్పినలినాయతాక్షి,
క్షేమంబుబడచుకొని యాదంపతులుకొంత.
దూరంబుబోవంగ దోటగనిపించె,
ఆతోటలోన సొంపారగానారింజ.
దబ్బలునిమ్మలును దాడింబపనస,
పొన్నలునుపొగడలును పోకమాకులుక న్నె.
మామిళ్ళుకానుగుల్ మద్దివృక్షములు,
మొగలుగాగలవృక్షములు గల్గియామధ్య
సలలితంబయినట్టి కొలనొకటియుండె,
అదిగాంచివారిద్దరా కొలనులోడిగ్గి.
స్నానంబుగావించి సంతోషమొప్ప,
ముదమొప్పగానిద్దరు దకపానముజేసి.
కొలనుగట్టునకెక్కి నలుదిక్కులందు,
పరికించిచూడంగ బాడుచావడియొకటి.
కనుపించగానలుడు కాంతతోగూడి,
సంతోషమునబాడు చావడిలోజేరి.
తగనశ్రమించిరా దంపతులువేడ్క,
అంతటనుధ్యాహ్నమయిన యాదమయంతి.
యెండతాకునపెదివెలెండి పాదములు,
నలుపులె త్తగమేన చెమ్మటలుగ్రమ్మంగ.
నలినాక్షప్పుడు వచ్చెమితిలేనినిద్ర,
అప్పుడానిద్రతానా నశక్యముగాక.
కటికనేలనుబండె కాంతాలలామ,

కనుమూసినంతలో గాఢ నిద్దురబట్టె.
యెడలెరుంకగయున్న పడతినీక్షించి,
ధరణీశ్వరుండంత తనకునిద్దురరాక.

—* దమయంతిని విడిచి నలుండరుగుట. *—

వెలదికష్టముజూచి వింపించనిట్లు,
చెలికత్తెలందరును సేవలుసేయంగ.
హంసతూలిక తల్పమందుబవళించి,
సుఖముగానిద్రించు సుందరాంగికి నేడు.
యీనేలపాన్పయ్యె నెటికర్మంబో,
ననుగూడివచ్చి కానలదుఃఖమొందుచును.
తనకష్టమెంతయునుదా జెప్పకొనదు,
దీనికష్టంబింక నేనుజూడగ లేను.
విరిబోణినిచ్చోట విడచిపోయెదను,
నిద్దురలేచి యీముద్దియనన్నెందు.
గానకవేగంబు కన్నవారింట,
జేరుకొనిసుఖముగా జీవించునేగాని.
బోధించిచెప్పి తేపోవ దెంతయును,
అనినిశ్చయము జేసి వనితమేల్కొనకుం
జీరెసగంబుగా జేతులనుబట్టి,
దునియించిమదిలోన దుఃఖమంతట బెంచి.
అయ్యయోయీబాల నడవిలోవిడచి;
నేనుబోయినవెనుక నీనాతిమేల్కాంచి.
పన్నగానక నెంతఖిన్నురాలగునో,
ప్రాణనాథుడులేని ప్రాణమేమిటికంచు.
పతిబోయివెంటనే మృతిబొందునేమొ,

పొదలందుసను వెదకబోవంగబులులెల్ల.
వీక్షించియాసతిని భక్షించునేమొ,
భీకరంబగునెండ కాకకోరువలేక.
ముదితయెక్కడనయిస మూర్ఛిల్లునేమొ,
అనిక్రింతసేపునయ్యవనీశ్వరుండిట్లు.
వేమారుదుఃఖించి ప్రేమజాలించి,
పోయెదనని లేచి భూపాలతిలకుండు.
నాలుగడుగులుబోయి నలినాక్షిజూచి,
నగరకేతెంచి ధారుణీపతిచాల.
చింతించెనీరీతి చిత్తంబులోన,
వాసవాదులునిన్ను వరియింపవచ్చితే.
వారినొల్లకనన్ను వరియించినావు,
బిడ్డలపైనయిన ప్రేమయించుక లేక.
అడవులకునాతోడ వెడలివచ్చితివి,
ఇట్టిసుగుణముగల్గినట్టి నిన్నియడవి.
నట్టనడుమునువిడిచి యెట్టులేగుదును,
పరితిరోయిటువంటి పాపాత్ముడగునన్ను.
నేలపెండ్లాడితివెయిందీవరాక్షి,
అనిపలుండీరీతి నధిపదుఃఖముబొంది.
పోయెదనని లేచి పోలేకతిరిగి,
వనయంతికడజేరి కమలాప్తుహాసంబు.
జూచిశోకము జెందుచుండ శనియపుడు,
సాహసంబుననలుని మోహపాశములెల్ల.
మొదలంటగాగోయ ముదితపయినపుడు,
మనసురోసిననలుండు మరియందునిల్వక నరు.

శరవేగమునఁబోవ శనియంతలోన,
 ఏపుగానీరాజు నాపుణ్యమూపెదనంచు.
నగ్నిహోత్రుని బిలువనంపించగాను,
 ప్రత్యక్షమయిన నాపావకునివీక్షించి.
శనివానితోనిట్లు వినుపించెనపుడు,
 పావకానలునిరూపము నీవుజెరుపుమీ.
యనుచుబ్రార్థింపంగ నాపావకుండు,
 నాయుదేవునితానునవ్వొప్పుగూర్చుకొని.
అడవిలోనన్ను చోక్కాకులంటుకొని,
 క్రమముప్పునుండి శాఖలనల్లుకొని.
పొగలుదిక్కులెల్లను గప్పివెక్కసంబుగను,
 భగభగమనిన భోభాగంబునంటంగ.
మంటలుమండుచును మ్రులుకునుగాలి,
 ఫెళఫెళమనివిరిగి పృథివిపైఁగూలంగ.
పక్షులునుమృగంబులును భస్మంబులగుచు,
 నుండంగనచ్చోట నొక్కపొదరింటిలో.
కర్కోటకుండనగ ఘనపన్నగంబు,
 అగ్నిమధ్యముఁజిక్కి చటునిటుబోవంగ.
మార్గంబుగానకను మదినిభీతిల్లి,
 ఒక వెదురుబొంగు మీదికినెక్కియుండంగ.
నాబొంగుమొదటనే యగ్నిరంగులకొని,
 కాలుచుండంగజూచి కర్కోటకుడుచాల.
మదిభీతినొంద నామార్గంబువెంట,
 నలరాజుబోవంగ నాగేంద్రుడీక్షించి.
వినయంబుతోబల్కె జననాథుతోడ,

ఓరాజదేవేంద్ర యోసత్కృపాసాంద్ర.
యోదీనసంరక్ష యోపంకజాక్ష,
యీయగ్నిలోనేను నిటజిక్కియున్నాడ.
రక్షింపగదయ్య రాజేంద్రనన్ను,
అనిపన్నగముబల్కనవనీశ్వరుండపుడు.
పామునుజూచి తాబల్కెనీరీతి,
వసుధపాములనన్ను పశిముగాదెవ్వరికి.
విషధరానిన్నంట వెరతునేననిన,
భూవరుజూచి యాభుజగేంద్రునిట్లనియె.
నరనాయకానీవు నన్నుగాచితివ,
మహమయిన యుపకారమొనరింతునీకునే.
ననిపాముప్రార్థింపన వనీశ్వరుండు,
కనికాతమొదయించి ఘనవహ్నిలోజొచ్చి.
వెదురొక్కటందింప వేగసర్పంబు,
వెదురందుకొనిదాని వెంబడిగదిగివచ్చి.
భూమిశుగాంచి యాభుజగమిట్లనియె,
భూపాలనన్నుగొంపోయి ముందరనున్న.
నదిలోనవిడిచితే ముద మొప్పగాను,
ఉపకారమొకటి నీకొనరింతునెగాని.
నాగుబాముచుబట్టి నలమహారాజు,
కడువేగనదియందు విడువంగనాపాము.
తప్పకనలునిపాదము మీదగరచె,
కరువంగినపుడు వంకలుబోయెదేహంబు.
కురచహస్తంబులును కురచపాదములు,
బిడుసైనవెంట్రుకలు పిల్లిగడ్డముమరియు.

ఒకసమయమునందునా యుర్వీశతిలకుండను.
నిన్నగ్నిలోనుంచి వన్నెమీరంగ,
తప్పించిబ్రోచునత్తరి వానిపాదంబు.
మెట్టిననీశాపముత్తకయగునంచు,
నామహాత్మ్యముజెప్పె నదిమొదలొక్కనినేను.
కునలేశనీరాక గోరుచున్నాఁడ,
వనమునకాలాగ్నివలె వచ్చినిన్నిట్లని
గరచితిననినీవు వెరువంగవలదు,
మరియొక్కటెరిఁగింతు మహిలోనదుర్జనులు.
కాంతిగ్రోవ్వగలేరు గానీవిట్లు,
వంచిసుందరముతో సంచరింపుచుండె.
జేరదియ్యరునిన్ను క్షితిలోననెవరు,
విభులేశనీవింక విపినభూములయందు.
విపరీతబుద్ధిచే విహరింపవలదు,
ధరణిలోసనయోధ్యా పురపాలకుండయిన.
ఋతుపర్ణుకడకు సమ్మతితోడనీవు,
జనియానృపాలునకు సారథ్యమొనరించు.
ఘనమయినరుచుల పాకంబుసేయుచును,
మూడుసంవత్సరంబులు నుండుమటమీఁద.
నీభార్యతోఁగూడి నిఖిలరాజ్యంబు,
దేవతల్మెచ్చంగ దీర్ఘకాలమునీవు.
పాలించగలవనుచు బల్కెసర్పంబు,
నకలంకమతినప్డు డాకర్కోటముతోడ.
వలువయొక్కటినిచ్చి పల్కెనీరీతి,
కరనుద్ధిగనీరూపు కావలెనన్నపుడు.

—* దమయంతి నలునిగానక విలపించుట. *—

చించినచీరె వీక్షించి బెగడొంది,
    పలువిధంబుల దాను ప్రాణనాథుని దలచి.
వెలవెలపాటుతో విలపించదొడగె,
    హా నన్నుధాకార హా కీర్తివిస్తార.
హా మేఘనగభీర హా మహాశూర,
    అయ్యయో నన్ను నడవిపాలుగ జేసి.
యెక్కడకేగితివి యినకులాధీశ,
    ననుబాసిపోనంచు నాతోడ నెరిగించి.
నేనిద్రబోవంగ మానవాధీశ,
    ఒంటిగా నన్నిక్కడుంచి పోవగ నీకు,
ధారుణీనాథ పాదంబు లెట్లాడె,
    నినుబాసి నేనొక్క నిమిషముండగ లేను.
ననుబాసిపోవంగ న్యాయమే నాథ,
    ఎన్నడు రాదుగా యిక నిద్దుర నాకు.
నిన్ను నన్ను నుబాప నేడు వచ్చినది,
    ఇచ్చోట ననువిడచి ఏల యేలబోయితివయ్య.
వచ్చిన నొకచోట చానమేమనము,
    గ్రహబాధలవి యెన్ని గతుల వచ్చినగాని.
గృహిణి విడుట పాపకృత్యంబు గాదె,
    కరమొప్పు నీదు వాక్యములు నా వీనులను.
వెరపకనే నెపుడు విందునో నాథ,
    కామించి నా కండ్ల కరువెల్ల దీరంగ.
నీరూపమెన్నటికి నే జూతునాథ,
    ఏ దేశమునకు బోయితివో నీవిచ్చోట.

నేదుఃఖమొందితివో యేమిసేయుదును,
నీవుగూర్చుండంగ నేనిద్రపోతినని.
భూపాలకోపమున బోయినావేమొ,
జగదీశ నేపాపజాతినిగాబట్టి.
అవనిలోనీకిట్టి యాపదల్గల్గె.
నగలోకనాయకా నను నీవు బెండ్లాడి.
నరగరాజ్యముబాసి బంధువులబాసి,
హయరథాదులబాసి యఖిలమిత్రులబాసి.
భయదకాంతారములపాలైతివకట,
ఇదియరణ్యంబనుచు నిపుడుదోచెనునాకు.
నిన్నాళ్ళునరకునా కిదిపట్నమనుచు,
భావించుకొంటినో ప్రాణేశ నేనిన్న.
నెక్కడవెదకెద నేమినేయుదును,
నరనాథనీవిపుడు నాకంటబడకున్న.
బరగనాప్రాణములు బట్టంగజాల,
మరుగుననీవేల మరిడాగియుంటివన్న.
పరుగునవచ్చినా ప్రాణముల్గావు,
పలుదెరంగులనిట్లు పడతిదుఃఖింపంగ.
మలమలమాడె కోమలలతాతరులు,
శిలలెల్లగరగె రాజీవబాంధవుడదరె.
మృగములెల్లనుజూచి మేతలనుమానె,
అప్పుడాదమయంతి యార్చటనుండికను.
ముప్పిరిగొనుశోకమున ప్రాణవిభుని,
అంగంగవెదకెదను నడవిలోనీరీతి.
గుందుచుదమయంతి కొంతదూరంబు,

సందుబొందులుదూరి మందయానముతోడ.
నేడ్చుచునీరీతి నేగుచుండంగ,
పదపడియా సమీపంబులోనున్నట్టి.
పొదరింటిలోనున్న పుట్టలోనుంచి,
పెనుబామొకటిలేచి బిరబిరనే తెంచి.
దమయంతిపదికేర పట్టుకొంది,
హా ప్రాణనాయకా యనుచుమూర్ఛిల్లంగ.
భోగీంద్రుడప్పుడా భూమీశుదేవి,
పాదములుబట్టి తప్పక మ్రింగుచుండంగ.
బడలికలాను కష్టపడమూర్ఛదెలసి,
తన్ను మ్రింగుచునున్న పన్నగమునీక్షించి.
ఘనశోకవార్ధిలో మునిగియిట్లనియె,
అయ్యయ్యో యీపాము నాహారమైతినా.
యిక్కడ నాకింక నెవ్వారుదిక్కు.
పామునువిడిపించు బలవంతులెవ్వారు.
నామేను మ్రింగుచున్నది యంతకంత,
కలరాజ్యమెల్ల పుష్కరరాజుకర్పించి.
కలిరాజుమాయచే గానలకునచ్చి,
ఇడుములుబడి జీవితేశ్వరునియెడబాసి.
కడపటనచ్చి యీ కాలాహిచేత,
మరణమొందగవలసె నిటుగనున్నదినిచే.
జానవిచ్చునె దీనిసాధించుగాని,
దైవమాయిట్టి బాధలనొందజేయంగ,
నీవేళనీకు నేనేమిజేసితిని,
అనియేడ్చుచుండంగ నారోదనంబెల్ల.

# నలచరిత్ర - పదము.

— బోయవాఁడు దమయంతిశాపంబునఁజచ్చుట

వినికలిమాయచే వేవేగనొక్క,
బోయవాఁడరుదెంచి బాయకతఁ జేఁ
బట్టినకత్తిచే పాముకంఠంబు,
తునియించియా పాముదూరముగబడవఁ
పూబోడిఁజూచియా బోయవాఁడనియె,
భయమునేదికలెమ్ము పడతిరో యిట్లు
కానలోపల నొంటిగాదిరుగనేల,
ఎవరిభార్యవునీవు యెందుండివచ్చితివి.
యీపాముచేత నీవెట్లుజిక్కితివి,
నాకుఁజెప్పుమటన్న నలినాక్షివానితో.
తనదువృత్తాంతమంతయు దాచకుండ,
తెలియఁజెప్పినవాఁడు చెలియతోనిట్లనియె.
వనితరో యిన్నిట్లు వనములో విడిచి,
వెళ్ళిపోయినవాని వెదుకంగనీకేల.
వానికన్నను మంచినాథుండనేను,
నీకేలచింతింప లోకంబులోఁజూడ.
మగువరో నేనసామాన్యుండఁగాను,
తేనెకల్లునలిరు దివ్యంపునేనేతుఁగా.
కన్నముల్ వేయంగ ఘనుఁడనేసుమ్ము,
తెగవాటుగొట్టెదను ధీరత్వముగనేను
పచ్చిపతనమునకు బహుగట్టివాఁడ
బోయలెవ్వరు నన్నుఁబోలఁజాలరు సుమ్ము
గావుననావెంటఁ దరలిరమ్మనిన,
వినిచాలకోపించి వెలదితనకోపంబు.

తనలోనవశచుకొని తరుణియిట్లనియె,
　　ఓయన్నవినరా నీకుచితమేయిట్లాడ.
వినరానిమాట నీవనెవాచరము,
　　తనరాజుభార్యయును తనయన్నభార్యయును
తనగురుభార్యయును తనభార్యతల్లి,
　　తనుగన్నతల్లియును తగనిక్కలై దువురు.
తానుతల్లిసములుగా దలంచగవలయు,
　　ఇలలోనవీరియెడ దప్పైరె ననుగాన.
పాలనకకామించి చూచినెంతటనె,
　　ఆయువచెడిపోవు నపకీర్తిసిద్ధించు.
మాయయునుముఖకాంతి మానంబుదూలు,
　　పాపంబువర్ధిల్లు విలసిల్లనశియించు.
రూపంబుచెడిపోవు రోగంబువచ్చు,
　　అంతటబోవక యమకింకరులచేత.
బహుబాధలను భవింపగవలసియుండు,
　　కావుననన్నిట్టి కావరంబునువిడిచి.
బుద్ధిగానుండు నావిప్పుబోడిచిపలుక,
　　బోయవాడిట్లనియె పొలతిరోయిటువంటి,
పాపంబులకునేను భయపడనుసుమ్ము,
　　బలవంతముగనిన్ను బట్టుకొండుపడంగి.
నావరంగనిక యూరకుండనేరుచు,
　　మానసంబునగాని సురివాక్కులనుగాని.
కన్నతల్లినుగాని విన్నులం... న,
　　చిత్తంబుచేత భంగాసెజేసెనుపతి.
ప్రతినాదునేనావాక్యంబునలన,

బోయవాడిప్పుడే భువిమీదబడినచ్చు.
గాకనిశపియింపగా దక్షణంబు,
పిడుగుమొత్తినరీతి పతితశాపమునగలి.
యాబోయవాడప్పు డవనిపై గూలి,
కలగుడుబలుమారు కాళ్ళుచేతులుతాను.
విలవిలదన్నుకొని విడిచె బ్రాణములు,
అప్పుడాదమయంతి యచ్చోట నెడబాసి.
వంతగుందుచుశోక వార్ధినీదుచును,
భూపతిననుబాసి పోయియుండుట జేసి.
ఈపాతకుడు నన్నునిట్లాడెగాక,
నావిభుండిందున్న నన్నీదురాత్ముండు.
హద్దుమీరిన మాటలాడంగగలడె,
మగదిక్కులేకున్న నగువప్రాణంబుతో
నుండంగదగదుబూ యుర్విలోపలను,
ఈయరణ్యంబునందిటు వంటిపాపాత్ము.
లెందరున్నారో నేనెట్లుబోగిలను,
ఆడపుట్టుకబుట్టి నట్టిపాపంబిది.
జగతిలోగూడునా పగవారికైన,
దిక్కులేకీరీతి దిరుగంగి నేజాల.
చచ్చితేమేలనుచు సాహసంబుగను,
పుట్టలోనచెయ్యి పెట్టెసర్పంబుగను.
బట్టిలాగిచనియు భయముచేదొలగి,
కరువకున్ననుచాల సరగందిసింహములు,
జడలుబట్టుకులాగ జగసెసింహములు,
పులులున్నకడకు గొబ్బునబోయిరాళ్ళతో.

గొట్టినయా పులులు కోపింపవయ్యె,
మదపువేనుంగులను మదిరాక్షిబట్టుకొని.
కఱ్ఱలతో గొట్ట కరులూరకుండె,
ముసుకొనివిషసర్పములు గోసిభక్షింప.
నాకలిదీరంగ నాశ్చర్యపడుచు,
బావురాదనియేడ్చి సాగిపోవుచునుండె.
ముందరగనుపించె మునిపల్లెయొకటి,
అంతనాదమయంతి సంతోషమొప్పంగ.
బిరబిరజనిమునీశ్వరుల మెడగాంచె,
శుకవాణివారి చెంతకుమల్లనేబోయి,

## దమయంతి మునులవలన నలునివృత్తాంతము నెరుగుట.

భువినాగి మ్రొక్కి తాభోరుమనియేడ్చె,
అప్పుడామునివర్యు లాయింతిబొడగాంచి.
నీలవేణిరో నీవు నేలయేడ్చెదవు,
మానినీమణివినుము మాయోగదృష్టిచే.
నిపుడనీవృత్తాంతమెల్ల కన్నులకు,
గట్టిపట్టుగ మాకు గనుపించెమిమ్మిటు.
పగచేతశనిబట్టి బాధింపుచుండె,
భయములేదింక నోపతికజాయతనేత్రి.
కష్టంపుదినములిక గడతేరవచ్చె,
నీప్రాణనాయకుడు నినుబాసిపోవుచును.
కర్కోటకునిచేత గరువంగబడియె,
ఆకారణంబుచే నతనిరూపముమారి.
వికృతరూపము బొందవేడ్కతోనతడు,
క్షితిలోనయోధ్యాధిపతియైన ఋతుపర్ణు.

నొద్దకుజేరుకొని గొబ్బునలుండుచట,
వంటలవాడయ్యె వనితరో నీవింక.
పతనికోసంబై నల వెతుకంగవలదు,
వనజాక్షి నీవు బాహుపట్టణముజేరి.
తదయకాభూవిభాను తల్లిదగ్గరను,
సైరంధ్రివై కష్టపడక గానుండుమీ.
వారకనికమూడు వత్సరంబులకు,
నీనాథుడునునీవు నెమ్మదిగాగూడి
మానితసకల సామ్రాజ్యవిభవములు,
అనుభవించ దేవింక నడలంగబనిలేదు.
పెనుపొందమేము జెప్పిన మాటనమ్ము,
అనిమునీశ్వరులిట్లు తనతోడ జెప్పంగ.
వెరవొప్పనిపిచాల విస్మయంబంది,
కలిగినచిత్తమొక్కటిగాగ జేర్చుకొని.
మునులపాదంబులకు మ్రొక్కి దమయంతి,
మునులవల్లననుజ్ఞ కొనిమానసములోన.
గొంతధైర్యముబూని కాంతవేగమున,
వెరవొప్పసైరంధ్రి వేషంబుధరియించి,
ఘనుడైనయాబాహు బాహుపట్టణమునకు,
రయమొప్పగాజేరి రాజవీధినిరాగ.

— దమయంతిసు బాహు పురమును జేరుట —

నాపట్టణములో నాడవాండ్రెల్ల,
దమయంతిగాంచి మోదంబుతో సంభ్రమున.
గుమిగూడియా చెలినిగొనియాడిరిట్లు,
ఈకాంతయెవరో యెందుండివచ్చెనో

యెందుఁ గేగునో యెఱుఁగంగరాదు,
వాణియో శ్రీకృష్ణు రాణియోగాక.
శర్వాణియో పరి యింద్రాణియోయనుచు,
భాషింపుచుండ నాభామయెవ్వరిదిక్కు.
జూడకుండగ నేగుచున్న సమయమున,
ఒకమేడపై సుబాహుని తల్లి దెలులలో.
కొమరుమీదగనిల్చి దమయంతిగాంచి,
తనచెంతనున్నట్టి దాదితోనిట్లనియె.
సుదతిరో యాచప్పు సుందరినిజూడు,
కారుమొగుంగువలె గనుపించుచున్నాది.
పలనొప్పు శ్రీలక్ష్మి వలెనున్నదియు,
దీనిసంగతిమనము దెలుసుకోవలెనిపుడు.
దయమున నీవేగి రాజీవముఖిని,
తోడితెమ్మనిబంప వేడుకతోడనా.
చెలికత్తెయోయియా చెలియకిట్లనియె,
మారాజమాత సన్నుదమొప్పగానిన్ను.
నతివేగదోడితెమ్మని బంపెనమ్మ,
రమణిరో నావెంట రమ్మనుచు బ్రార్థింప.
దానివెంబడిబోయె దమయంతియపుడు,
చనుదేరనప్పుడా జననాయకునితల్లి.
దమయంతిగాంచి సంతసమొప్పబల్కె,
ఇందీవరాక్షినీ విబుధకాంతవగపుచే.
నెందుబోయ్యెదవు నీవెవరికూతురవు,
ఇలలోననీకు ప్రాణేశుండెవ్వాడు.
కలకంఠినీమేనగల లక్షణములు,

కనుగొనబహు వింతగాదోచెనాకిప్పుడు.
రాకేందువదనరో నీకుపేరేమి,
ఎరిగింపునీవిధం బెల్లనాకిప్పుడని.
రాజమాతయుబల్క - ఏమణియిట్లనియె,
సైరంధ్రికులమందు సంభవించితినేను.
నాపేరుప్రభురాణి వలినాయతాక్షి,
ధరనలుకడనెపు గంధర్వుండునాభర్త.
సైరంధ్రులెవరు నాసాటిగారన్న,
గంధములుదీయంగ కాటుకలుబెట్టంగ.
దండలుద్రువ్వంగ దలలుదువ్వంగ,
నగలెల్లధరియింప నవ్యసూత్రంబుగను.
మువ్వరసగా నాణిముత్యములుగూర్ప,
పాపటలుదిద్దంగ బాగుగాజడలల్ల.
కురులెల్లసవరించి కొప్పుముడువంగ,
పొందుగాగొప్పులో బువ్వములుదురుముంగ.
దీరుగాకస్తూరికా రేఖదీర్ప,
నసువుగానాచేత నగునట్టిపనులెల్ల.
బొరిగింపజ్ఞపనులకే బోవనెన్నడును
చెలరేగిబంగవారి చెంతజేరకబోను.
పనవికనగనోప విడియంబుసేయ,
మగువలోయిప్పుడున్న మాయుచీరెకుత్తప్ప.
మరియేదిగట్ట నమ్మనమొప్పనేను,
తరళాక్షినన్ను నీదాసిగానేలుమీ.
ఓలచెదముదముతో నీయొద్దననగ,
ఆరాజమాతయా యవనీశుసతిజూచి.

కారుణ్యరసమొల్కఁగా బల్కు విట్లు
ఆదిలక్ష్మీదేవియవతరించినరీతి
నేడుమాగృహమునకునీవువచ్చితివి
పొలతిరోమా కెల్ల బుద్ధి జెప్పుచునీవు
నొనరంగ మారొద్దనుండ వేయమ్మ
అని చెప్పితనబిడ్డయగుసునందనుబిలిచి
నీనిసంరక్షించుమిమానీవటంచు
జెప్పి యాదమయంతినీకొప్పగించగ
తరళాక్షియచ్చోట దానేర్చుపనులు
కొమరొప్ప నెర వేర్చుకొనుచుండగానంత
నలవిదర్భాపురంబందుభీముండు
దమయంతినలమహీంధవులవృత్తాంతంబు
దెలియకనుమదిలోనబలుచింతనొంది

భీముడుసుదేవునినలదమయంతుల వెదుకనంపుట.

తనపురోహితుసుదేవుని వేగబిలిపించి
వినయంబుతోబల్కెజననాయకుండు
భూసురోత్తమనీవుబోయి నాయల్లుండు
నాపుత్రియెచటనున్నారొశీఘ్రంబు
ఏదేశమునయున్న నేవనంబులనున్న
వలనొప్పగాగాంచి వారిక్షేమంబు
నాకు జెప్పితి వేని నా దేశముననీవు
కోరినయొకమంచిగ్రామమునీకిత్తు
తడయకబొమ్మన్న ధారుణీసురుడంత
రాజాజ్ఞగొనితానరయ మెప్పగాను

గౌళదేశంబుబంగాళదేశముమరియు
మాళవదేశంబుమత్స్యదేశంబు
కాశ్మీరదేశంబుకర్ణాటదేశంబు
బర్బరదేశంబుపాండ్యదేశంబు
చేదిదేశముసూరసేనదేశముమరియు
కోసలదేశంబు కుకురదేశంబు
కొంకణదేశంబుతెంకణదేశంబు
చోళదేశంబుపాంచాలదేశంబు
మొదలుగాగలదేశములు నరణ్యంబులును
కలయంగ వెదకి యెక్కడ గానలేక

సుదేవుండుసుబాహునిగృహంబున దమయంతినిజూచుట.

భువిసుబాహుండేలు పురమునకు నేతెంచి
పతియిల్లుశోధించిక్షితిదేవుడంత
ఒకదినంబునసుబాహునికోటలోజొచ్చి
యందంకశోధింపనంతఃపురమున
దరుమగాజడగట్టితలవెండ్రుకలతోడ
వన్నెజారినయట్టి వదనంబుతోడ
తడబడుచునున్నపాదములతోడనుబాల
వాడినపూదీగవలెనొక్కచోట
గూర్చుండియున్నయాకోమలాంగినిజూచి
వనితయాదమయంతివలెనున్నదనుచు
అవునకోకాదకోయనివిప్రవర్యుండు
దగ్గరకేతేరదమయంతిజూచి
తనతండ్రియొద్దనుండినబ్రాహ్మణుండనుచు
బోలికబట్టియాపూబోడియపుడు

వెలవెలబోయి తొదలవంచుకొనియుండ
మించివిప్రుఁ డని దానిం చితనమదిని
తప్పకుండగనిదియుదమయంతి యే యనుచు
నిశ్చయపరచుకొని నెలతకిట్లనియె
ఓ రాజవదనయిందున్నావ కేనీవు
దమయంతివినుమునీధవుఁ డెందుబోయె
భూలోకమెల్ల బెంపుగ నేలుచున్నట్టి
పట్టభద్రుని చెట్టబట్టియీరీతి
కట్టపుట్టము లేకకడ లేనిదుఃఖంబు
బొందగ జేసినాపొలతి దైవంబు
ననుబంపెమితండ్రి డీననితరోమిము వెదుక
ననుచువిప్రుఁడుబల్కనాకోమలాంగి
ఎలుగెత్తిభోరుమని యేడ్వగానుసునంద
పరుగెత్తితల్లితో బల్కెనీరీతి
మాతరో వినుమిపుడుమనప్రభురాణి యొక
విప్రునిబొడగాంచి వెక్కసంబుగను
ఏడ్చుచున్నదటంచు నెరుగింపగానంత
నతివేగమునవచ్చె నారాజమాత
వచ్చియాదమయంతి గ్రుచ్చికౌగిట జేర్చి
విప్రునిజూచియా వెలదియిట్లనియె
ఈతలోదరియిపుడిట్లేల శోకింప
నిటకుబంపిన వారలెవరయ్యమిమ్ము
తటుకున జెప్పుమంతయు నిప్పుడనగా నె
విరిబోణిజూచి యావిప్రుఁడిట్లనియె
పడతివిదర్భభూపతి పురోహితుడనే

**సుబాహునితల్లి దమయంతివృత్తాంతమునువిని చింతించుట.**

నతడు సన్నుతించె నమ్మరో వినుమ
రమణయీకాంత మారాజపుత్రికసుమ్మ
దమయంతియను పేర దనరునీయింతి
నలునిపట్టపురాణి విలసితకాంతి
పూర్వకర్మంబుచే బుష్కరునితోడ
నలుడుజూదంబాడి నాల్గుదిక్కులతోడి
కట్టుబట్టలతోడ గాంతతోగూడి
అడవులకేగినాడని విచారముతోడ
వారికెదురుగ బంపెమారాజునన్ను
దేశదేశములెల్ల దిరిగి నేడిచ్చోట
వనితజూచితి భాగ్యవశముచేననగ
వినియప్పుడాసుబాహుని తల్లి దమయంతి
కౌగిటజేర్చికొని ఘనశోకముననుు
విలపించెనిరీతి వెలదిరోయిటువంటి
తగని వేషము దాల్పతగునటేనీకు
ధారుణీశుని బాసి తల్లడింపుచునీవు
ధరణిలోనెన్ని బాధలనొందినావో
ఎలనాగయొంటిగా నెట్లువచ్చితివమ్మ
నాతల్లి నాయమ్మ నాముద్దుచిలుక
ఈతెరంగెల్ల నాకెరుక సేయకనప్పు
డేలదాచితివి నన్నెరుగవేతల్లి
పొలతిరో నీవు నాపుత్రిపిగావకొ

గో నేను నీతల్లి యునుగూడ
ఒకతల్లి బిడ్డలము నౌనరంగ నీవునే
పినతల్లి గానటే వనజాయతాక్షి
ఇపుడయిన జెప్పవే యిటకువచ్చిన తెరగు
వనగ నాపినతల్లి కనిశొదముయుంతి
ధరయెల్ల నోడినా ధవుడు నేనునుగూడి
ఘోరవనంబులకు జేరియచ్చోట
విహరింపుచుండంగ విభుడుగట్టినబట్ట
పక్షులెత్తుకపోవ బతియు నేనొక్క
కోకగట్టుక మహాఘోరవనములలోన
బరితపింపుచునొక్క పాడుసావడిని
జేరి నేనిద్రింప జీవితేశుడునన్ను
విడచిపోయిన నేను విభునిగానకను
కుందుచునడవిలో నందంద వెదకుచు
పడతిరో నేసకల బాధలనుబొంది
చిత్తమెల్లజలించి సిగ్గుచే నేనిట్లు
విరిబోణి సైరంధ్రి వేషంబుబూని
నీతోడ జెప్పకను నీయొద్దగొలువుంటి
ధవుడెందుబోయెనో తల్లి నేనెరుగ
కనకాంగి యిమ్మిట్లు శనిబట్టి బాధించె
నని జెప్పగానప్పుడా రాజమాత
భూమిలో నెవరైన పొందజాలని బాధ
లనుభవించగవలసె నమ్మరో నీకు
అనుచు శోకించి చయ్యనభూషణంబులును
మిక్కిలివిలువైన మేలు వస్త్రములు

వేవేగ దెప్పించి యావధూమణికిచ్చి
ధరియింపవమ్మ నీధవుని వెదకింతు
ననిపల్కగానపుడు యారాజమాతతో
క్రమమొప్పబల్కెనా దమయంతియపుడు
ఈభూషణాంబరము లిప్పుడెట్లుధరింతు
నలుగురునను జూచి నవ్వరాతల్లి
పతినరణ్యములందు బాసి తానేతెంచి
సుఖియింపుచున్నదని చూచువారెల్ల
జెప్పుకోరతల్లి యిప్పుడివినాకేల
ముదితకుపతిలేని ముస్తాబులేల
నాజీవితేశుండు నన్నేలునలరాజు
వేడుకననుగూడు నాడు సౌఖ్యములు
అనుభవింపగవచ్చు నమ్మకోనదేల
ననగ నాదమయంతి నపుడాదరించి
తనకుమారునితోడ దమయంతివృత్తాంత
మంతయునెరిగించి యారాజమాత
కనకాంగి వెదుకవచ్చిన బ్రాహ్మణోత్తముని
భక్తితో బూజించి బహుమతుల్ జేసి
పసగుల్కు బంగారు పల్లకీలోపలను
కాంతినుగూర్చుండగా బెట్టియపుడు
తగుసహాయంబిచ్చి తడయబంపంగ

## దమయంతి తండ్రి పట్టణంబునకు బోవుట.

బద్మాక్షితనతండ్రి పట్టణము జేరి
నంతనంతఃపురంబాదు పల్లకీడిగ్గి
తనతండ్రిగారి పాదములపై బడుచు

ఘోరముగ దుఃఖింపగొబ్బున తనతల్లి
పరుగున వచ్చి తప్పక పుత్రిమీద
బడి కౌగిలించి నా పట్టిరో నీకిట్టి
పాట్లు బెట్టెనటమ్మ పాపదైవంబు
పట్టభద్రుని చెట్ట బట్టి యీరీతిగా
కట్టబుట్టము లేక కారడవులందు
విహరింపగా నీకు విధి వ్రాసెనా డకటే
నీనాథు డెటు బోయెనే ముద్దుగుమ్మ
నీతోడి వారెల్ల నెమ్మదిగా బ్రతుక
వ్రాత నీకిటు వ్రాసె నా పద్మభవుడు
కన్నబిడ్డల బాసి కాననంబున నీవు
నొంటిగా నేరీతి నుంటి వోయమ్మ
తల్లిరోయిటువంటి తగని వేషంబిప్పు
డిట్లు ధరింపనీ వెట్లోర్చినావె
నీసుకుమారంబు నీమోము కాంతియును
నీరాజ్యవిభవంబు నేడెందు బోయె
నీబిడ్డలను జూచి నేను నీతండ్రియును
శోకవారిధి దేలుచుంటిమోయమ్మ
అని యేడ్చి యా బిడ్డలను వేగ దెప్పించి
తన కొప్పగించంగ దమయంతి చనులు
పాలు చేపూరంగ పడతి యా బిడ్డలను
కౌగిట జేర్చుకొని కడు సుఖమొంద
భీమభూపాలుండు ప్రియపుత్రి నూరార్చి
ఘనుడైన యా బ్రాహ్మణుని జూచి పల్కె
ఏదయా శోధనో మేదినీసురవర్య

పొడగంటిమయ్యా మాపుత్రికను నేడు
నలు డెందునున్నాడో తెలియంగ రాదయ్యో
శ్రమజేసి మీరిపుడు జననాథు వెదకి
దెచ్చి తేమీకు నే హెచ్చైన బహుమతుల్
గావింతుననుచుండ గావిప్రవరుని
దమయంతిజూచి మోదంబొప్పనిట్లనియె
పరమసంతోష సంభరితాత్మయగుచు
ఓవిప్రవరనీవు నూరూరుదిరుగంగ
బని లేదువినుము నాపతియున్నతావు
మునినాయకులవల్ల వినియుంటినదిమీకు
జెప్పెదవినుము నాజీవితేశుండు
ధారుణిలో నయోధ్యాపురాధిపుడైన
ఋతుపర్ణుకడమారి రూపంబుతోడ
కొలువుండెనీవు నెక్కువ నేర్పుతోబోయి
కడువేడ్క ఋతుపర్ణుగాంచి యిట్లనుము
ధరణీశనలరాజు తనమేను దెలియకను
పూనిజూదంబాడి భువియెల్లనోడి
తనభార్యతోగూడి వనవాసమునకేగి
యొకచెట్టుక్రింద నయ్యువిదనిద్రింప
కఠినాత్ముడగుచునా కాంతనక్కడవిడచి
యెటుబోయెనోగాని యెరుగంగ రాదు
మగువనిద్దుర లేచి మగనిగానక తాను
దిగులొంది యందంద దిరిగిదుఃఖించి
కడుకటాక్షమునను దల్లి దండ్రులజేరె
నిట్టినిర్దయభర్త లెందైనగలర

అనియిట్లుమీారు బల్కినప్పుడామాట
వినియాతడేమనా వేరెవరిఁకింక
నెవ్వరేమందురో యేర్పాటుగానీవు
యాలించివచ్చితే యూవెనుక నేను
వేరొక్క సంగతినివినుపింతుననగా నె

**సుదేవుడు నలునివెతుకుటకై యయోధ్య జేరుట.**

మంచిదేయనిసమ్మతించి బ్రాహ్మణుడు
నేపారగానయోధ్యా పురంబునకేగి
క్షితిదేవుడప్పుడా ఋతుపర్ణుగాంచి
విజయోస్తుయనుచు దీవింపగనారాజు
ధరణీసురునిగాంచి తానిట్లుబల్కె
ఓవిప్రవర్యసిదేవ్వారు మాకడకు
నిపుడువచ్చిన కార్యమెరిగింపుమనగ
పుడమిలోనవిదర్భ పురమునాకాపురము
ఆపురాధీశ్వరున కాశ్రితుడ నేను
భూమీశ మారాజ పుత్రియగుదమయంతి
నలమహారాజు భూవరలోకమందు
వరరూపలావణ్య వైభవోన్నతుడంచు
సకలసద్గుణభోగ సంపన్నుడంచు
సురలనొల్లక వాని వరియించెదమయంతి
వెసనానలుండు దుర్వ్యసనంబుచేత
ఆపత్తులకుమూలమైన జూదంబాడి
కలరాజ్యమెల్ల బుష్కరరాజుతోడి
దమయంతితోగూడి తగనరణ్యము జేరి
యిడుములుబడితుదకు పుడమీశ్వరుండు

అడవిలో పాము సాపడి జేరియాచోట
దమయంతి నిద్రింప దయమాలి నలుడు
ఒంటిగా నామచ్చకంటి నడవినివిడచి
భూపాలుడెక్కడికి బోయెనో గాని
మరికొంత సేపటికి మగువ నిద్దుర లేచి
పతి నెందుగానకను పరితపించుచును
సకలకష్టముల నొంది స్వామికటాక్షమున
నెట్టన దమయంతి పుట్టిల్లు చేరె
అతడిట్టిమార్గ్గ దనిము న్నెరింగితే
తనపుత్రి నేలనిచ్చును భీమవిభుడు
తావచ్చినది మొదలు దమయంతి నలుని కై
ఘనమయిన శోకాగ్ని గ్రాగుచుండంగ
భూమీశు వెదుకంగ భీముండు మము బంప
దేశ దేశము లెల్ల దిరిగితిమి గాని
రాజవర్యుడు గాన రాడయ్యె నెచ్చోట
పుడమి నేకష్టముల్ బొందుచున్నాడో
ఎట్టిరూపము దాల్చి యెచ్చోట నున్నాడో
యేమి సేయగవచ్చు నిటమీద ననగ
విని ఋతుపర్ణుడా విప్రవర్యుని జూచి
కటకటా యనియిట్లు గాబల్కె నపుడు
నలునిట్లు నిందింప నలదా మహారాజు
బహుసజ్జనుడు గాని పాతకుడుగాడు
సన్నుతింపగదగిన సత్యవంతుడు గాని
దూషింపతగినట్టి దుష్టుండుగాడు
అతని పుణ్యముచేత నలివేణి దమయంతి

తండ్రియిలు జేరు కొనెనిక నింతెచాలు
పుడమిాశ్వరున కేమి పురుషుండతడు కాని
యేనాటికైన దానిటవచ్చి జేరు
క్షితిసురోత్తమ వాని వెతుకంగ పని లేదు
మిారుమిాతావునకు జేరుకొండనుచు
పల్కుచుండంగ నా బాహుకుండరుదెంచి
యా బ్రాహ్మణునితోడనప్పు డిట్లనియె
కలిమాయచేత నావలరాజు పుష్కరుని
తోడజూదంబాడి యోడియడవులకు
భార్యతోనేగితా బహుకష్టములుబొంది
యేకారణంబుననో యాకాంతవిడచి
భూమిాశుడెందైనపోయి యుండగవచ్చు
మగనినిందింపంగదగునె యీరీతి
నలునిగుణంబెల్ల నారీమణి యెరింగి
తెలియనిరీతిగా దిట్టింపదగునె
క్షితిలోనదా పతివ్రతయంచు బొగడొంది
పతినినిదించుమనిపంపె నానిన్ను
పతివల్ల నేరంబు ప్రాపించియుంటేను
నతితనమదిలోన సైరింపవలయు
అంతియెగాని యేకాంతలైననుమగని
రట్టుసేయింతురే రాజసభలందు
అయిననా కెందుకని యా బాహుకుండపుడు
వంటశాలకుపోయె వెంటనేతాను
ఆమాటలకువిప్రు డాశ్చర్యమునుబొంది
జననాయకునియొద్ద సెలవు బుచ్చుకొని

భీమునిపురి జేరి ప్రీతితో దమయంతి
తనతండ్రికడనున్న తరిభూసురుండు
వారిగనుగొనిపల్కె మీరు జెప్పినరీతి
అతిమోదంబునబోయి ఋతుపర్ణుగాంచి
నలునిదూషింపంగ నరనాయకుడుచాల
చింతపడియిట్లు నిందించవలదంచు
జెప్పుచుండగనంత గొప్పగర్భము వాడు
కడుభయంకరమైన కడుదోయివాడు
తడయక గొప్పదంతంబులుగలవాడు
కరుకునల్లనిరూపు కనుపొట్టవాడు
పేడిగడ్డము వాడు పెద్దపిక్కలవాడు
కురుచవస్త్రము వాడుగుజ్జు రూపుండు
మముజూచిబల్కెనక్రమముగా దమయంతి
తగినరాజులసభల మగనినిందింప
మిముబంపవచ్చునా మేదినిలో నలుని
గుణమెరుంగదె తాను గోపింపగాను
గ్రహచారవశముచేగహనంబు లోనలుడు
విడనాడిపోవంగ పడతియారీతి
నిందింపుమనిబంపు సుందరాంగికితగునె
యనిబల్కెనని చెప్పినా బ్రాహ్మణుడు
ఆమాటలెల్ల దా నాలించిదమయంతి
అతడెనలుండనుచు నాత్మనూహించి
దమయంతియప్పుడే తండ్రిగారినిజూచి
పల్కెనీరీతిగా భామాలలామ
అతడెనాప్రాణేశు డందుకించుకయైన

మదిలోననాకు ననుమానంబులేదు
ఒప్పిగానిటక్షతని రప్పింపగానిపుడు
క్రమమయినదొక యుపాయమెవిన్నవింతు
దానికిమీరింక తప్పుగా నెన్నకుడు
నారీతిగాకుంటె వతడిందురాడు
సరసతనలుని భూచక్రమంతయువెదకి
యెందుగానక లేక నిపుడుభీముండు
చపలాక్షిదమయంతి కిపుడు రెండవస్వయం
వరముసాటించుమని వర్తమానంబు
నయమూరఋతుపర్ణు నకుమాత్రమంపితే
నారాజువచ్చితే నతనితో నలుడు
తప్పకుండగవచ్చు తరువాతమనకోర్కె
సఫలంబుజెందునని సఖియు జెప్పంగ
ఆమాటలకుభీము డలరిమంత్రులకెల్ల
నెరిగించిధారుణీ సురలరావించి
మీరయోధ్యకుబోయి నారూఢిఋతుపర్ణు
గనుగొనిమీరటు గాజెప్పవలయు
నలరాజుకొరకునయి నాలుదిక్కులయందు
వెదకించిభీముండు వేసారియిపుడు
తనపుత్రియయినట్టి దమయంతికినివేడ్క
వరుసరెండవస్వయం వరముగావింప
తలచిభీముండఖిల ధాత్రీశ్వరులకెల్ల
యునమారగావర్తమానంబుజేసె
వలనొప్పనాయుత్సవము జూడగామీరు
విచ్చేయుమనిచెప్పి వేగరండనుచు

పంపించెనంతనా బ్రాహ్మణోత్తములేగి
కడువేడ్క ఋతుపర్ణు గాంచియీవార్త
జెప్పగానారాజ శేఖరుడుముదమంది
బాహుకుజూచితా బల్కెనీరీతి
వింటివేబాహుకా వేడ్కతోభీముండు
తనపుత్రియయినట్టి దమయంతికిపుడు
వరసరెండవ స్వయంవరముచాటించెనట
పోవలయు మనమునిప్పుడువిదర్భకును
అరథంబునకు మంచియశ్వరత్నంబులను
తెరగొప్పనవరించి తెమ్ముర్వేగంబు
అనగనాబాహు కుండశ్వశాలకుబోయి
యెన్నికగుఱ్ఱముల నేర్పరచుచుండ
వార్ష్ణేయుడనువాడు పరతెంచిబాహుకుని
గాంచియిట్లని బల్కెగౌరవంబుగను
ఎందుకీగుఱ్ఱముల నెంచుచున్నావనుచు
బల్కెనవాసితో బాహుకుండనియె
వినుముజెప్పెద నిపుడువిశ్వంబులోనొక్క
వింతకార్యముబుట్టె వినలేదనీవు
నలరాజుపై భీమనరనాయకుండిపుడు
కలవిలేనివికొన్ని గల్పించిమరియు
అడవిలోదనపుత్రి విడచిపోయెనటంచు
కుపితాత్ముడనినలుని కోపించియిట్టి
క్షితిలోననికవాని వెతుకనేలనటంచు
తనముద్దుకూతురగు దమయంతికిపుడు
మారుపెళ్ళియొనర్పమదిలోనదలపోసి

వసుధేశ్వరులకెల్ల వర్తమానంబు
పంపించెనాదుకై సొంపుగామనరాజు
ముదమునబోవంగ మదినిశ్చయించి
కోమరొప్పగామంచి గుఱ్ఱముల నేర్పరచి
తేరుకుగట్టితా దెమ్మనుచుబాపి
అనగవార్ష్ణేయుడతిఖిన్నతనుజెంది
కన్నులబాష్పముల్ గ్రమ్మ యిట్లనియె
నరలోకనుతుడయిన నలమహారాజునకు
అక్కటాయిట్టిమహాప వాదంబు
తక్కకవచ్చెనే ధారుణిలోనిందు
కేమిసేయగవచ్చు నెవ్వారికయిన
వినుముబాహుకనాదు వృత్తాంతమంతయును
నన్నేలుఖామందు నలమహారాజు
అతనినమ్మినవారి కయ్యయ్యోయిటులయ్యె
నతనికిసారథి నయ్యుందునేను
అతడుజూడగబోడు నట్టికాలమునందు
అతనిబిడ్డలను భీమావనీశ్వరుని
యొద్దకుగొనిపోయి యొప్పించిబీరాన
నేవచ్చునంతలో భూసురోత్తముడు
అడవికిబోవంగ గడుదుఃఖమున నేను
నిక్కడకొలువుండ నింతకాలంబు
ననిజెప్పగానలుం డాత్మలోజింతించి
వార్ష్ణేయుతోడనా బాహుకుండనియె
కలిబట్టియీరీతి నలునిబాధింపంగ
మనమేమిజేసెదము మానుమీచింత

పంపించెనంతనా బ్రాహ్మణోత్తము లేగి
కడువేడ్క ఋతుపర్ణు గాంచియీవార్త
చెప్పగానారాజ శేఖరుడుముదమంది
బాహుకుజూచితా బల్కెనీరీతి
వింటివే బాహుకా వేడ్కతో భీముండు
తనపుత్రియయినట్టి దమయంతికిపుడు
వరసరెండవ స్వయంవరముచాటించెనట
పోవలయు మనమునిప్పుడువిదర్భకును
అరధంబునకు మంచియశ్వరత్నంబులను
తెరగొప్పసవరించి తెమ్ము వేగంబు
అనగనా బాహుకుండశ్వశాలకుబోయి
యెన్నికగుఱ్ఱముల నేర్పరచుచుండ
వార్ష్ణేయుడనువాడు వరతెంచి బాహుకుని
గాంచియిట్లని బల్కె గౌరవంబుగను
ఎందుకీగుఱ్ఱముల నెంచుచున్నావనుచు
బల్కినవానితో బాహుకుండనియె
వినుము జెప్పెద నిపుడువిశ్వంబులోనొక్క
వింత కార్యముబుట్టె వినలేదనీవు
నలరాజుపై భీమనరనాయకుండిపుడు
కలవి లేనివికొన్ని గల్పించిమరియు
అడవిలోదనపుత్రి విడచిపోయెనటంచు
కుపితాత్ముడనినలుని కోపించితిట్టి
క్షితిలోననిక వాని వెతుక నేలనటంచు
తనముద్దుకూతురగు దమయంతికిపుడు
మారుపెళ్ళియొనర్పమదిలోనదలపోసి

వసుధేశ్వరులకెల్ల వర్తమానంబు
పంపించెనందుకై సొంపుగామనరాజు
ముదమునబోవంగ మదినిశ్చయించి
కొమరొప్పగామంచి గుఱ్ఱములనేర్పరచి
తేరుకుగట్టితా దెమ్మనుచుబంపి
అనగనాహౌష్టేయుడతిఖిన్నతను జెంది
కన్నులబాష్పముల్ గ్రమ్మ యిట్లనియె
నరలోకిసుతుడయిన నలమహారాజునకు
అక్కటాయిట్టిమహాప వాదంబు
తక్కకవచ్చెనే ధారుణిలోనిందు
కేమిసేయగవచ్చు నెవ్వారికయిన
వినుము బాహుకనాదు వృత్తాంతమంతయును
నన్నేలుఖామందు నలమహారాజు
అతనినమ్మినవారి కయ్యేరోయిటులయ్యె
నతనికిసారధి నయ్యుందు నేను
అతడుజూదంబాడు నట్టికాలమునందు
అతనిబిడ్డలను భీమావనీశ్వరుని
యొద్దకుగొనిపోయి యొప్పించిబీరాన
నేనచ్చునంతలో భూసురోత్తముడు
అడవికిబోవంగ గడుదుఃఖముననేను
నిక్కడకొలువుండ సింతకాలంబు
ననిజెప్పగానలుం డాత్మలోజింతించి
హౌష్టేయుతోడనా బాహుకుండనియె
కలిబట్టియీరీతి నలునిబాధింపంగ
మనమేమిజేసెదము మానుమీచింత

అనియూరడించి చయ్యన వాయువేగంబు
గలగుఱ్ఱముల నెంచి గట్టెరథమునకు
ప్రోలుపుమీరగ జెక్కుమాలునాయుధంబులను.
నమరించియారథం బాయత్తపరచి
ధరణీశునకు దెల్ప దడయ కాఋతుపర్ణు
డరుదెంచియారథం బరువడిగ నెక్కె

—ఋతుపర్ణుండు విదర్భ కేగుట.—

తగ బాహుకుండపుడు నొగలమీదికి నెక్కి
నడిపించుచుండంగ నడుమ నారథము
మందంబుగా నడువ మనుజేశ్వరుడుజూచి
యిదియేమి బాహుకా యీరథంబునకు
బడుగుగుఱ్ఱముల నేర్పరచికట్టితివేల
నడచు [illegible] శత యోజనంబులీదినము
అశ్వలక్షణమందు నతిఘనుండనటంచు
నీ మొద్దుగుఱ్ఱముల నెట్లుగట్టితివి
అనగ బాహుకుడిట్టు లనియెఋతుపర్ణుతో
వాయువేగముకన్న వడిగనీవేళ
ప్రొద్దుగ్రుంకకమున్న బోవచ్చునిదెమాడ
ననిగుఱ్ఱములబట్టు నదలింపగాను
భూమిగడగడవడక భూరిశబ్దముతోడ
శరవేగమునరథం బరుగుచుండంగ
ఉర్వీశ్వరునిచేత నున్న చిన్నరుమాలు
జారినేలబడంగ జనపాలుడపుడు
నిల్పు బాహుకరథము నిమిషమాత్రంబిపుడు.

అవనిపైనుత్తరీయము జారిపడియె
దిగివేగమరిసీవు దెచ్చియిమ్మనగనా
పార్థివేంద్రునిజూచి బాహుకుడనవ్వి
యేరీతినీకునే నివ్వగల్తురుమాలు
నరవరయొక యోజనమువచ్చినాము
అనగనాఋతుపర్ణు డాశ్చర్యచిత్తుడై
బాహుకాయనిమెచ్చి పల్కె భూవిభుడు
విశ్వంబులోనెల్ల వెలుగొందుచున్నట్టి
యశ్వలక్షణములకు నధిపతివినీవు
నిక్కంబునామాట నీవంటిసారథిని
యెక్కడకనివిని యెరుగ నెన్నడును
అరుదుగానాకు నీయశ్వలక్షణమెల్ల
నెరిగించితే నీకు నెరిగింతునొకటి
అల్లదేముందటను యతిర[illegible]న
తాడిమానొకటుండె [illegible]సికవిరెండు
కూడియున్నవిపెద్ద కొమ్మలందు [illegible]క్క
కొమ్మకునూరేసి కొమ్మలునుగలవు
కొమ్మకొమ్మకుపువ్వు గుత్తులుండును రెండు
వెలుగుచున్నవిదాని వేళ్ళుయేనూరు
అమరంగమరిదాని యాకులసోగలై
వెళుపులైమెత్తనై విరిసియున్నవియు
ఫలములొకకొమ్మకును పదివేలుగన్పడును
అదిజూచిరమ్మని ననగ బాహుకుడు
రథముగ్రక్కునడిగ్గి రయమొప్పగాదాను
దాడిమానున్న చెంతకుబోనగాను

మెల్ల మెల్లగ రథము మేదినీనాయకుఁడు
వలనొప్పఁ దోలుకొని వచ్చుచుండఁగ
బాహుకుండట కేగి పరికించిచూడఁగ
భూతలాధీశుఁడప్పు డు జెప్పినట్లు
యించుకంతయునైన యెచ్చుతగ్గులు లేక
నుండఁగయా బాహుకుండునరుదంది
నిండు వేడుక గోడ నిలచున్న సమయమున
గర్కోటకుఁడు తొల్లి గరచినవిషంబు
నలుని దేహముబర్వ కలిపురుషునకునందు
నుండశక్యముగాక నురుతరంబుగను
బొళుకుబొళుకునరక్తములు గ్రక్కుకొనుచు
నానలరాజుముందరనుకలిపురుషుడప్పుడు
ప్రత్యక్షమైనిలచి పాలభాగమునందు
కరములు జోడించి కలిబల్కె నిట్లు
నలరాజచంద్రయో నరలోకదేవేంద్రు
దమయంతినన్ను గాదనితొల్లి నీవు
వలనొప్పవరియింప వచ్చునాయని నేను
నెరుగక నినుబట్టి యింతకాలంబు
కష్టపెట్టితిమిచ్చు గర్వంబుచే నేను
కడుతప్పు జేసితిని కరుణింపునన్ను
తరుణిపతివ్రతాధర్మమించుకినయిన
గానక మిమ్మింత కష్టపెట్టితిని
ధరణీతలేశయీ తప్పులెల్లనుమరచి
కరుణింపవేనన్ను కమలాప్తకులజ
సరిసతనిసత్య సంపదకిపుడు నే

వెరచినిన్న భయంబు వేసుచున్నాడ
మనుజనాయకనీకు మహితసంపదలెల్ల
నరుసతోనెప్పటి వలెవచ్చునింక
వరమిత్తునడుగుమీ వసుధేశయనిబల్క
బుడమీశుడాతనికి భువిసాగిమ్రొక్కి
కలిదేవమూడు లోకములోననీవంటి
బలవంతమైన దైవంబెందులేదు
మూడులోకములందు మునమొప్పనాపేరు
కారుణ్యమొప్ప విఖ్యాతిజేసితివి
కరుణచేనిపుడొక్క వరమిత్తునంటివిక
నేనుగోరినవరము నిమ్మొదయతోడ
ననుదలంచినయట్టి జనులజేరకుమెపుడు
నాచరిత్రముజదువు నరులజేరకుము
వరభక్తితోవిన్నవారిజేరగబోకు
వలనొప్పగావ్రాయు వారిజేరకుము
మనలకెప్పుడుతాడి మానుయందుననీవు
వదలకనుండు మీవరముదక్కంగ
మరియేవరమునాకు మదినికోర్కెయులేదు
అనివిన్నవించంగ శనిసంతసించి
అలనీశ్వరుడుకోరినట్టి వరములనిచ్చి
పొలుపారదీవించి కలిమోదమలర
తాడిమ్రానకునజేరె ధరణీశ్వరునిమేను
చులకనై యుండుటకు చోద్యంబునొంది
శనికిమ్రొక్కియనుజ్ఞ గొనియానలుండపుడు
పరతెంచియాబుతు పర్ణురథమెక్కి

మను జేసుచేతొడి మానుమర్మము దెలసి
అశ్వమర్మంబెల్ల నాతనికి జెప్పి
పరువడియావిదర్భాపుర సమీపమున
కరుగంగదమయంతి యాంరథధ్వనిని
వినిసంతసంబుచే ఘనమైనయొక మేడ
పై నెక్కియారథము పరికించిచూచి
ఇంత వేగంబిట్లు నీ తేరుగడుపంగ
నలుడుగాకున్న నే నరులకువశంబు
మునులు జెప్పినరీతి మూడేండ్లు నేటితో
బరిపూర్ణమయ్యెదప్పక నావిభుండు
చనుదెంచునిందుకే సందేహముండదని
నిశ్చయంబొనరించి నెలత వేగమున
పరుగునతనతండ్రి పాలికప్పుడుబోయి
పంకజముఖి విన్నపము జేసెనిట్లు
నీయల్లుడదెవచ్చె నీవిప్పుడేబోయి
వారలనతి గౌరవంబుగావించి
కరమొప్పుదివ్యమందిర మందువిడియించి
రమ్మనిబల్కనా రాజోత్తముండు
అలకుతూహలమొప్పబుుతు పర్ణునకు తాను
యెదురుగానేగి మర్యాదగావించి
బాహుకునిచాల సంభావించివారలను
విమలమందిరమందు విడియించివచ్చి
దమయంతికెరిగింప దరళాక్షిమోదించి
చెలికత్తెలనుబిలచి చెప్పెనిరీతి
సతులార వినరె యీబుుతుపర్ణువద్ద నే

బాహుకునొద్దకు దమయంతి చెలికత్తె లరుగుట. —

వికృతరూపమున నావిభుడున్నవాడు
అతిసంతసంబొప్ప రుతుపర్ణుడున్నట్టి
విడిదికీమీరేగి వెడరూపధరుని
జూచిసంభాషించియా చర్యలన్నియును
జెప్పుడీనాతోడ శీఘ్రంబుగాను
అనిచెప్పి పంపంగ నాయిందుముఖులంత
నతివేగబోయిరా రుతుపర్ణుబసకు
పడతులక్కడనున్న పరిచారకులజూచి
యారూఢినిట్లనిరి మీరాజునకును
ఘనముగారథముతోలిన సారథినిజూడ
నభిలాషతోడ మేమరుదెంచినాము
ఆతడెక్కడనుండునని వారలడుగంగ
వాడదోవంటలను వండుచున్నాడు
చూచిపొండనగనా సుందరీమణులంత
వాలాయముగవంట శాలనుబోయి
వెడరూపధరుగాంచి వికవికనవ్వుచును
వానితోబల్కిరా వనితలీరీతి
యేదేశమయ్యమీదే యూరుకాపురము
యేకులంబయ్య మరినీకుపేరేమి
ఈరాజునొద్దనీవెన్ని దినములనుండి
కొలువుంటివోమాకు తెలియంగజెప్పు
ఇట్టిరూపంబు నీకెట్టుగావచ్చెనో
వివరింపుమా నలుండవుగావెనీవు
రుతుపర్ణకడమారు రూపంబుతోనీవు

తగనుంటివనుచుమాదమయంతిశోడ
మునివర్యులెరిగింప ముద మొప్పనీవిటకు
వచ్చుటకై స్వయం వరమనుచు జెప్పి
నయముగా రుతుపర్ణునకుమాత్రమే వర్త
మానమంపి చెలీ మావనీశ్వరుడు
ధరణీశయిక నేల దాచెదవునీగుట్టు
తెల్లడయినదిఇంక వేంచేయవయ్య
అనుచుబల్కగనలుండా భామినులజూచి
నవ్వుచుబల్కెనో నలినాక్షులార
నన్నేలమీరిట్లు నవ్వుతాలాడెదరు
నేనువంటలవాడ నిశ్చయంబుగను
నా పేరుబాహుకుడు నమ్మకుంటేమీరు
తెడయకమా రాజు నడిగిచూడండి
ననునలుడని మీరలనుటయుక్తముగాదు
నలు డెక్కడున్నాడు కలకంఠులార
నలుడు యెడల మీనాతియగుదమయంతి
వెలయ రెండవ పెండ్లి దలచు నేయిట్లు
రుతుపర్ణునకుగల్గు రూపురేఖలుజూచి
రమ్మనిదమయంతి మిమ్ముబంపంగ
అటబోక మీరిప్పు డిటకేలవచ్చితిరి
మతిబోయెనా నేడు సతులారమీకు
అతిరూపవంతుడౌ రుతుపర్ణువరియించి
సఖులారదమయంతి సుఖియింపవచ్చు
ననిబాహుకుడుబల్క నాతలోదరులెల్ల
తెల్లడంబందియా ధరణీశుగాంచి

ధర్మమానీవిట్టి తప్పులుబట్టంగ
  గ్రొత్తయేదమయంతి చిత్తంబునీకు
నీవువచ్చుటకిటు నెపముకల్పనజేసి
  దమయంతివలదన్న దానదియువినక
ఒక్కయీబుతుపర్ణు నొద్దకాభీముండు
  నీవార్తబంపించె నింతమాత్రంబు
తప్పుగాదోచెనే ధారుణీశ్వరనీకు
  నెరుగవుగాబోలు తరుణిచిత్తంబు
క్షమియించుమనిపల్కి కమలాక్షులతివేగ
  దమయంతికడకేగి క్రమమెప్పగాను
పూసగ్రుచ్చినరీతి పూబోడికిని దెల్ప
  నతిమోదముననలుం డతడేయటంచు
మదిలోనదలచి సమ్మదమెప్ప దమయంతి
  చెలికత్తెలనుజూచి బలికెనేరీతి
ఇంతులారామీర లీబిడ్డలిద్దరిని
  వెంటదీసుకపోయి వేషధారికిని

దమయంతి పుత్రులను బాహుకుదగ్గరికి బంపుట.—

గనుకరచిరండు యీ వెనకమీకొకరీతి
  జెప్పిదననగనా చెలికత్తెలంత
మనమారగాబిడ్డలను చంకనెత్తుకొని
  వెంటనేబోయిరా వంటశాలకును
పోయిబాహుకునొద్ద పొందుగాబిడ్డలను
  విడువంగనా బాహుకుడుగాంచి యపుడు
బిరబిరవచ్చియీ బిడ్డలనందుకొని

కౌగిట జేర్చుకొని గదిలోకిబోయి
తలుపోరగా బెట్టి తనయ కాబిడ్డలను
తొడలపై నుంచుకొని దుఃఖించుచుండె
చెలికత్తెలదిగాంచి పలికిరాతనితోడ
నేల యేడ్చెదవయ్య యింతలో నీవు
బహువిధంబుల మేము ప్రార్థింపుచుండంగ
మనమారగానలుడ నని జెప్పవలదె
నలుడగానని పల్క నరనాధ నీవిపుడు
ఈబిడ్డలను జూచి యేడ్వంగ నేల
బొంకినప్పటికైన పోసత్తు మేనిన్ను
నేర్పు చేమేమెల్ల నిను బైలుపుచ్చి
పట్టితీసుకపోయి కమలాక్షి ముందటను
బెట్టెదమీదినము గట్టిగానమ్ము
కొమ్మలిట్లనిరంచు కోపింపగాబోకు
వరసకు బావవని సరసమాడితిమి
అనగనా బాహుకుం డప్పుడుదిగ్గున లేచి
కన్నులొత్తుకొని యాకాంతలను జూచి
నన్నువిూరలు హేళ నంబు జేసెద రేల
వినుడి చెప్పెదను నా వృత్తాంతమంత
ఈ బాలకులబోలి యిద్దరుబిడ్డలును
నాకున్నవారలో నలినాక్షులార
ఈరాజుకొల్వునకు నేవచ్చి నేటికిని
మూడు సంవత్సరంబులు గడచెగాన
సుతులచే నొకమారు జూచివచ్చెదనంటె
బోనివ్వకున్నాడు భూమీశ్వరుండు

ఈబిడ్డలనుజూడ నాబిడ్డలనుబోలి
యుండుటచేదుఃఖ ముప్పొంగెనాకు
తప్పుబట్టకమీరు తల్లిదగ్గరకింక
నిపుడుదీసుకపొండు యీబాలకులను
అనిబాలకులదెచ్చి యీ చెలికత్తెలకు
నిచ్చివేయగవారు చెచ్చెరనుబోయి
దమయంతికెరిగింప దరళాక్షిమోదించి
యతడెతనప్రాణేశు డనినిశ్చయించి
మగునలజూచితా మరియిట్లులనిబల్కె
వారకమరియొక్క వారుటూరేగి
అతడువండినకూర అన్నంబుదీసుకొని
రండుచూతాము యెట్లుండునోవంట
అనిచెప్పిపంపంగ నాతక్షణమువారు
జనిబాహుకునిగాంచి సఖియలిట్లనిరి
ఘనబలానీవువండిన కూడుగూరయును
దమయంతియొక్కింత దయసేయుమనియె
కోపంబుసేయకను కొంచెమిప్పించితే
సంతసించెదమనుచు సఖులుబల్కంగ
పసిడిగిన్నెలలోన బరమాన్నమునుమంచి
కూరలురెండు [illegible]చి వారికప్పుడిచ్చి
పొండనుచుగ [illegible] [illegible]బోడులతివేగ
జనుదెంచిద[illegible]యంతి సన్నిధినిబెట్టె
అప్పుడాదమయంతి యాకూడుయునుకూర
తనబిడ్డలకుబెట్టి దాదులకునిచ్చి
తానుకొంతభుజించి దైవమాయనియెడ్చి
యెక్కడనేర్చెనో యిటువంటివంట

—

ధరణిలోనిట్టి దుర్దశలనుభవింపంగ
సేయుగామేమేమి జేసితిమితనికి
అనుచుదుఃఖించితా నాతక్షణము లేచి
తనతండ్రికడ కేగి తగబల్కెనిట్లు
చెలికత్తెలేగియా నలువర్తమానంబు
నయమారబరిశీల నము జేసినారు
లేశంబుసందియము లేదింకనీనలని
ప్రియమారగాపిటకు బిలిపింపుమనిన
ఒకభూసురులబిలిచి యుర్వీశుడిట్లనియె
ఋతుపర్ణుకడకుని వతివేగబోయి
వసుదేశమా యొద్ద వంట జేసెడువాని
చూడ వేడుకగల్గి నేడుమారాజు
తనతోడ జెప్పియాతని దోడితెమ్మనుచు
పంపించెనని చెప్పి బహువేగముగను
వెడరూపధరునిని వెంటబెట్టుకరమ్ము
వేగపొమ్మనగనా విప్రోత్తముండు
కడువేగఋతుపర్ణ కడకేగియామాట
జెప్పంగనా రాజ శేఖరుండపుడు
బాహుకునిరావించి బల్కెఋతుపర్ణుండు
భీమభూపతినిన్ను బిలువనంపించె
వరపుత్రికినిస్వయం వరమహోత్సవమంచు
మనలరప్పించెనా మనుజేశ్వరుండు
రాజేంద్రులెవ్వరును రాలేదుయీసరిని
కడువింతగానుండె గారణంబేమొ
తెలియకున్నదిమనకు వలనొప్పనివిపుడు
నీవిప్రవరునితో నేగివేగంబు

అతడురమ్మన్న కార్యము జూచుకొనినచల
రమ్ముపోవలయుమన రాజ్యంబునకును
అనగనాబాహుకుం డావిప్రునెను నేటు
భీమునినగరునకు ప్రియమొప్ప నేగె

బాహుకుండు భీమునిగృహంబునకు వెళ్ళుట.——

ఆభీమనరపాలు డంతలోనొకకొప్ప
నవరత్నసింహాస నంబుదెప్పించి
అచ్చోటనుంపించి యాబాహుకుని గాంచి
జననాథుడెదురుగా జనికౌగలించి
క్షితినాథరమ్ము యీసింహాసనంబుపై
కుతుకంబెలర్పంగ గూర్చుండుమనగ
నవ్వి బాహుకుడంత నరనాయకునిజూచి
మతిబోయెనానీకు మానవాధీశ
ఘనమైనదొరవుయీ కనకపీఠంబెక్క
నీకుచెల్లునుగాని నాకెట్లుజెల్లు
నుర్విలోనొకరాజు నొద్దవంటలవాడ
సింహాసనంబెక్క జెల్లునే నాకు
అనగభీముడుబల్కె జననాయకోత్తమా
యేలనీరీతిగా నేలనాడెదవు
ప్రాకటంబుగనిపుడు నాకాంతయును జెప్పె
నలుడవుగా వెయ్యా నరనాథచంద్ర
ఊర్వీశఋతుపర్ణు నొద్దసేవికుడ
మన్ననతోగొల్చి యున్నాడవనుచు
దెలిసినిన్నిచ్చటకు దెప్పించుటకునిల్లు
వగుసగొడనసాయం వరమునుమునేను

నరనాధరుతుపర్ణునకు మాత్రమేవార్త
నేనుబంపించితిని నీవువచ్చుటకు
అదితప్పటంచునీ మదినుంచుకోబోక
క్షమసేయవలయునో జననాధచంద్ర
అనగభీమునిజూచి జననాయకుడుబల్కె
పోపొమ్ముపెద్దలై బుద్ధిలేశంబు
లేకయిట్లాడంగ నికుజెల్లునటయ్య
భ్రమసిమీరిబ్బంగి బలుకంగదగదు
ఇట్టికురూపునకు నేరీతినీపుత్రి
నిచ్చితివయ్యనీ వెరుగవేనాడు
అనిబల్కదమయంతి గనిబాహుకుడుబల్కె
వనజాక్షిగనునీవు వరియించినావె
తనభర్తగుర్తెరుంగని వారులోకమున
నెందైనగలరటే యిందీవరాక్షి
బాహుకుండిట్లన బల్కగాదమయంతి
తడబాటుతోనపుడు దగ్గిరకువచ్చి
అతడుగట్టినయట్టి యర్ధవస్త్రముజూచి
నిస్సంశయముననా నీరేజవదన
పాదపద్మములపైబడి కావురనయేడ్చి
రూపకందర్పయీ రూపంబునీకు
నేలాగుప్రాప్తించె నిదియేమిపాపమో
నీసుందరాంగంబు నీమృదుత్వంబు
ఎక్కడబోయెనో యేమిసేయుదునింక
అయ్యయోదైవమా యనియేడ్చుచుండ
కనుగొనినలుడు దుఃఖముబట్టగాలేక
భోరునయేడ్వనప్పుడు భీమనృపతి

దమనుం సుదాంతులును గుమిగూడిఘొల్లుమని
సభయెల్లబగుల నూనక యేడ్చిరిట్లు
ధరణీశుడానఃబడు తనదుఃఖమణచుకొని
తక్కినవారినం దగినినోదార్చి
దమయంతిజూచి భూధవుడిట్లనుచుబల్కె
నింతిరోకష్టంబు లెన్నివచ్చినను
జననాథు లెవ్వరును వినరానివాక్యంబు
సభలకుబంపించి సాటింపదగ ర
మారుపెండ్లియటన్న మాటనెవ్వరువిన్న
ఇలలోనయిదియెంత హీనంబు చెపుము
వరుసరెండవస్వయం వరమనుచునందరి
గబురుబంపినవెనుక కాంతరో నేను
నిన్నేలుకుంటినా నిఖిలలోకంబులను
నన్నేమనందురో విన నారెల్ల
నలుడిపుడురాకుంటె ,కా వ్వరినైన
వరియించుననుచు గరు జెప్పుకొనరె
అవనిలోనిటువంటి యపకీర్తిభరియింప
నాకుశక్యముగాదు నాతిరోయింక
ఎల్లభూపతులిటకు నేతెంచుచున్నారు
వారినందరినీవు వలనొప్పజూచి
నాతినీకన్నులకు నజ్రైనభూవరుని
వరియించిసుఖియింపు వనితరో నేను
ముదమొప్పవనవాస మునకుబోదునటన్న
ధరణీశ్వరునిజూచి దమయంతిబల్కె
జననాథమీకట్టి సందేహముండినను
హారిహారబహాందు లమదికతులు

చూడనావాచిత్ర శుద్ధిలోకుల కెల్ల
దెలియంగమీకుకా దేహంబుదీర
అప్పులోజ్వాగ్నికే నరుగు దెంచెదనన్న
నట్లుగావింపుమా యనిబల్కె నలుడు
దమయంతియప్పుడే తండ్రిగారినిజూచి
యతివేగగావింపు మగ్నికుండంబు

—దమయంతి యగ్నిప్రవేశంబగుట.—

అనగనాభీముండు నాతక్షణంబాదు
మంత్రులకెరిగింప మరివారలపుడు
పనివాండ్రబిలపించి ఘనమయినగుండంబు
త్రవ్వించిదానిలో దట్టంబుగాను
యెండుమ్రాకులుదాని నిండపేరుపుచేసి
అగ్నిదగిలింపంగ నద్భుతంబుగను
గుప్పుగుప్పునపొగల్ నుప్పురంబల్లుకొని
మంటలులేచి మిన్నంటుచుండంగ
దమయంతియపుడు సంతసమొప్పగాలేచి
తనప్రాణనాయకుని దగ్గరకుబోయి
ముమ్మారువలగొనుచు ముదమొప్పగాతని
పాదముల్ రెండుతన ఫాలమునసోకి
సాష్టాంగపడిలేచి నిష్టతోజనుదెంచి
ముదమొప్పనగ్నికిని ముమ్మారుదిరిగి
కరయుగంబునుమోడ్చి ఘనభక్తిమీరంగ
పావకునినీరీతి ప్రార్థించెనపుడు
ఓదేవపూజితా యోహవ్యవాహనా
యోసర్వభక్షకా యోయగ్నిదేవ
కరమొప్పవాక్కాయ కర్మంబెపుడయిన
యనయుడాయనప్పుడు భువనపతి

పతిభక్తినేడు దప్పినదాననైతె
పరగనాదేహంబు భస్మంబుగావింపు
లేకున్ననన్ను బాలింపవేయనుచు
ప్రార్థనజేసియా భామాలలామంబు
పతిపాదములుహృదయ పంకజంబందు
కిడుభక్తితోనిల్పి కలహంసకొలనులో
జొచ్చినరీతిగా జొచ్చెనాచిచ్చు
అప్పుడుగీర్వాణు లంబరంబుననిల్చి
పరగబువ్వులవాన గురిపించిరపుడు
బ్రహ్మాదిదేవతలు నలునికి ప్రత్యక్షంబగుట.—
శ్రీవిష్ణుడపుడు లక్ష్మిదేవితోగూడి
ఖగవాహనారూఢు డగుచువేగముగ
పరమేష్ఠిశంకరులు తనవెంటనేతేర
సురయక్షసిద్ధ కిన్నరులుగొల్వంగ
విచ్చేసినలమహీ విభునిముందరనిలువ
గనుగొనినలుడు వెక్కసమందియపుడు
పుడమిసాష్టాంగ పడిలేచితనరెండు
హస్తముల్ జోడించి మస్తకమునందు
జేర్చుకొనినిశ్చలత చిత్తుడయినలరాజు
వనజాక్షునీరీతి వర్ణింపదొడగె
జయరమారమణీశ జయదైత్యకులనాశ
జయబాహుబలధుర్య జయదేవవర్య
జయనీరదాకార జయవార్ధిగంభీర
జయజయమందార జయజయోద్ధార
జయభక్తసంరక్ష జయపాండుసుతపక్ష
జయరమాయాతపక్ష జయపంక

జయ సర్వజనపోష జయ సత్యసంభాష
జయదుష్టనిశ్శేష జయగోపవేష
జయరాధినాలోల జయసాధుపరిపాల
జయకాంచనదుకూల జయజయాశీల
బ్రహ్మాదులేనిన్ను బ్రస్తుతింపగ లేరు
నరకీటకుండనా నాతరంబగునె
అనియిట్లువినుతింప నామహావిష్ణుండు
నృపవర్యుజూచితా గృపతోడబల్కె
జననాథవినుముని సత్యసంపదలెల్ల
నఖిలలోకంబులం దాక్రమించినవి
కలిబుట్టిమిమ్మింత కాలంబుశ్రమబెట్టె
బరగనీసత్యంబు గురుతెరుగ లేక
ధారుణినాథ భూతలమందునీవంటి
సత్యసంధులు లేరు సత్యంబుగాను
వెలయంగబుష్కరుని గెలిచినీరాజ్యంబు
పరిపాలనము సేయు నరపాలతిలక
అనిపల్కుచుండంగ నంతలోశ్రీలక్ష్మి
దావాగ్నిజొచ్చియా దమయంతిసపుడు
నగుమోముతోడ మన్ననగాగిలించుకొని
పైనదోడ్కొనివచ్చి పరమమోదమున
నలునిచెంతకువచ్చి నిలువంగదమయంతి
భక్తినయ్యిందిరా పాదంబులకును
సాష్టాంగమర్పించి సన్నుతుల్ గావింప
నింతితోబల్కె నయ్యిందిరాదేవి
క్షితిలోనగల పతివ్రతలెందరైననీ

నీకీర్తియీరేడు లోకంబులందునను
    పరిపూర్ణముగనిండె తరుణీలలామ
నీనాయకునిగూడి నెమ్మదిగానీవు
    క్షితిలోనవర్ధిల్లు శీతాంశువదన
అనియిట్లుదీవింప నాయాదివిష్ణుండు
    నలరాజుతోబల్కె నయమొప్పగాను
అర్కవంశజతొల్లి కర్కోటకుడునీకు
    నిచ్చినచేలంబు నిపుడుధరియించి
సొంపుగానీపూర్వ సుందరాకారంబు
    దమయంతికినిజూపు ధరణీతలేంద్ర
అనియిట్లుమాధవుం డానతిచ్చినమహా
    సంతసంబునమహీ కాంతుండువేగ
భుజగేంద్రుడిచ్చిన పుట్టంబుగట్టుకొని
    తనతొంటిరూపంబు ధరియించెనలుడు
అపుడక్కడున్నవా రందరద్భుతమంది
    నలునిగీర్తించి రెన్నగనేవిధముల
శ్రీవిష్ణుడప్పుడా క్షితినాథుదీవించి
    బహువరంబులొసంగి బ్రహ్మాదులెల్ల
నరభక్తిగొలువంగ వైకుంఠపురమునకు
    నమరలక్ష్మిసమేతముగవిచ్చేసె
ఋతుపర్ణుడరుదెంచి క్షితినాయకునిగాంచి
    పలగొనిసాష్టాంగ వందనముజేసి
నలరాజచంద్రయో నరలోకదేవేంద్ర
మున్నునీచేనేను మ్రొక్కించుకొంటి
యుర్వీశనేమహా గర్వంబుచేదొల్లి
నీచందమునులెల్ల నీకు జెప్పితిని

నాతిప్పుసైరించి ననుగాచిరక్షించు
నీపాదములెనాకు ప్రాపురాజేంద్ర
అపరాధి నపరాధి నని వేడుచుండంగ
క్షితినాయకుడుబల్కె బుతుపర్ణుతోడ
అవనీశనివింకనట్టి సందేహంబు
నుంచకుమదిలోన నించుకింతైన
క్షితినాథనన్ను పోషించితివిమాజేంద్ర
నేదీర్చగాగలన నీఋణంబెల్ల
జననాధనీదేశమున కేగి సుఖముగా
రాజ్యమేలుచునుండు రాజేంద్రయనిన
నలునకుమ్రొక్కి యానరనాయకుండాజ్ఞ
కొనిముదంబున జేరెదనపట్టణంబు
నలుడిచ్చటవిదర్భనగర మందునాల్గు
దినములునివసించి తనమామగాంచి
భూమీశమాపురికిబోయి రావలెనేను
వలనొప్పజతురంగ బలమునాతోడ
యిప్పించుడనిగదా నప్పుడాభీముండు
కరులునురథములును ఘనతురంగములు
కాల్బలంబులునివ్వ గానంతోర్వీశుండు

—నలుండు నిషధాపురంబున కేతెంచుట—

రయమొప్ప నిషధాపురంబునకు జేరి
పుష్కరునిజూచి యాభూమీశ్వరుండుబల్కె
కలిమాయచేనన్ను గెలిచితివితొల్లి
అటువంటిజూదంబు నవనీశమాకిప్పు
డాడుదమురమ్మన్న నాతడిట్లనియె
జనపాలవినవయ్య శనియాజలేకుండ

నీతోడజూదంబు నే నాడననిన
జూదమాడకయుంటె క్షోణీతలంబెల్ల
విడచిపొమ్మారీతివిడచి పోకున్న
నరనాథ యుద్ధంబునకురమ్మురాకుంటె
బలిమినినినుబట్టి బంధింతుననగ
విని పుష్కరుండు యీవిధముగానూహించె
ధరణీతలమువిడువ పరువులోకంబు
బలుయుద్ధమొనరింప బ్రాణంబునకుహాని
జూదమాడుటమంచి సులభంబటంచు
ధరణీశుతోడ జూదంబాడిసకలంబు
నొకటిరెండాటలను యోడిపుష్కరుడు
తనభార్యతోగూడి తాబోవగానలుడు
నాస్థానమున కేగె నతిముదంబొప్ప
తనమంత్రిగాంచి సంతసమొప్పనిట్లనియె
తటుకునదమయంతి నిటకు వేగంబు
పిల్లలతోగూడ బిలుపించుమనగానె
ధరణీశ్వరునియాజ్ఞ శిరసావహించి
తగువారిబంపించి దమయంతిరప్పించె
దడయకప్పుడు వశిష్ఠుడు నేగుదెంచి
ఘనవైభవంబొప్ప గాసురల్ బొగడంగ
క్షితిపతిపట్టాభిషేకంబునొందె
వార్ష్ణేయుడప్పుడే పరతెంచినలరాజు
పాదంబులకుమ్రొక్కి మోదంబుమీఱ
కొలువుండెమరియు నానలధారుణీశ్వరుడు
క్రమమొప్ప నశ్వమేథములుగావించి
ధరణిషోడశమహా దానముల్ సేయుచును

సుర్వీతలంబేలె బూర్వకాలమున
అనియిట్లునాథర్మ జునితోడబృహదశ్వ
చంద్రుండెరిగింప ముదమందియప్పుడు
మునినాయకునిపాద వనజంబునకు మ్రొక్కి
సన్నుతుల్ గావింపసన్మునీశ్వరుడు
ఘనకృపారసముల్క గా పాండుతనయులను
మనమారదీవించి చనియెనమ్మౌని
వలనొప్పు నలచక్రవర్తిచారిత్రంబు
పదము జేసితిని శ్రీపతికంకితముగ
భక్తినెవ్వారుదీనిపాడినను వ్రాసినను
విన్నను రుక్మిణీ విభుకటాక్షమున
ఇహలోకమందు వారెల్ల సుఖములు జెంది
అంత్యమందున రమాకాంతుసన్నిధిని
శాశ్వతంబుగనుండు జనులారమీర
లిదియాసక్తితో జనువరయ్యానిరతంబు
శార్వరినామ వత్సరభాద్రపదకృష్ణ
పంచమిసరితిది పరిపూర్ణమయ్యె॥

గద్యా. శ్రీ వేణుగోపాల చరణారవిందమరందపానాను
దానందతుందిలేందిందిరాయమానాంతరం శ్రీ...
కోటివంశ పయఃపారావార రాకాసుధాకర భా...
గోత్ర పవిత్ర భాగయామాత్య పుత్ర సకల విద్వజ్జనవి...
య సీతారామయాభిధేయప్రణీతంబైన నలచరిత్రమను
పదకావ్యము సర్వము సంపూర్ణము.



అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలా ముద్రితము, 1925.